# పు ష్ప హా స



ఆఱంకముల నాటకము.



గ్రంథకర్త:
దేవరసెట్టి కాశీవిశ్వనాథగుప్త.

ఓం.

అవిఘ్నమస్తు.

శ్రీ సీతారామచంద్రాయ నమః.

# పుష్పహాస



౫ అంకముల నా




గ్రంథకర్త:

దేవరసెట్టి కాశీవిశ్వనాథగుప్త.

బెల్లంకొండ





బెజవాడ

శ్రీ కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 500.

1937






వెల 0-8-0

# హెచ్చరిక



ఈ నాటకము గ్రంథకర్తయొక్క వ్రాతమూలకమైన అనుమతి లేనిదే యెవ్వరును ప్రదర్శింపకూడదు.

గ్రంథకర్త.

# పీ ఠి క.

విద్వన్మహాశయులారా!

శ్లో. "మందః కవియశః ప్రార్థీ, గమిష్యా మ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః"

అని కవికుల శేఖరుండగు కాళిదాస మహాశయుండు వచించి
నటుల కించిద్జ్ఞుడనగు నేను నాటక రచనమునకు బూనుకొనుట
కేవలము హాస్యాస్పదము. "కావ్యేషు నాటకం రమ్య"మ్మనుటచే నట్టి
దానినే వ్రాతమను పేరాస వొడమినదికాని "తదపి కష్ట"మ్మనుట మాత్ర
మాలోచింపక, నేటి ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున వెలుంగుచున్న
రసికవర్యుల నాటక ఖద్యోత సముదాయమున నీ నా నాటక ఖద్యోత
మెటుల ప్రకాశించునా యనియును సందేహింపక, మొదలిడి యెట్ట
కేలకు వాఙ్మయ స్వరూపిణియగు వాణీ పరిపూర్ణానుగ్రహమున నీ విధ
ముగా పూరింపగల్గితి. అజ్ఞుడనగు నా యీ ప్రథమ ప్రయత్నమున నం
దసంఖ్యాకంబులైన దోసంగులు పొసంగుగాన ప్రాజ్ఞులగువా రనుగ్ర
హించి తెలుపుచో పునర్ముద్రణమునందు సవరించుకొన గలవాడను.
ఈ చిన్ని పొత్తమును నిరసింపక తమ నిరంతర బ్రహ్మాత్మానుచింతనం
బున కంతరాయంబని కూడ చింతింపక మదీయ భక్తిలతానిబద్ధాంత
రంగులై యవ్యాజ వాత్సల్యపూర్వకముగ నవకాశము గలిగినపుడెల్ల
సహృదయులై నిరీక్షించిన బ్రహ్మశ్రీ "తర్క-వేదాంత విశారద,
తత్త్వోపన్యాస విశారద" ముదిగొండ వెంకట రామశాస్త్రిగారికిని,
అభిప్రాయము లొసంగినబ్రహ్మశ్రీలు విద్వాన్ శతావధాని దోమా
వేంకటస్వామిగుప్తగారికిని, "కవితాకోవిద" రావిపాటి లక్ష్మీనారా
యణగారికిని, "అష్టావధాని" బొడ్డు బాపిరాజుగారికిని ననేకకృతజ్ఞతాభి
వందనము లర్పించుచున్నవాడ.

ఇట్లు సుజన విధేయుఁడు,

గ్రంథకర్త.

దేవరసెట్టి కాశీవిశ్వనాథగుప్త,

ఓం

శ్రీసద్గురుస్మరణమ్

# పండిత నిరీక్షణము.

అనాద్య విద్యా పరికల్పితాహంకారాది దేహాంతానేకవికల్పనాటకంబు లనె సమయించి తత్తాదృగ్విధనైకవిధనాటకాంతరాత్మస్వరూప సర్వభూతాత్మభూత నిరతిశయాఖండ సచ్చిదానంద బ్రహ్మాత్మావస్థితిలో నోంకారమందిరమున శ్రీసద్గురు కృపావిశేషమున తురీయపాదావాసము నధిగమించుటకై కేవలశృంగార రసప్రధానమై కల్పిత గాథాత్మమగు నీ పుష్పహాస నాటకమును పరాధ్యారోపిత కర్తృత్వముతో దిలకించుట కీ గ్రంథకర్త మన్మిత్ర శ్రేణిలోని వాడై వేదశాస్త్ర దేవబ్రాహ్మణ భక్తిభరితు డగుటయే కాక బాల్య యౌవనసంధికాలములో నేను పలువిధముల బయలుదేరుచున్న స్వేచ్ఛాచారాను బద్ధభావభూయిష్ఠ కవిత్వ ధోరణిగాక సనాతన వర్ణాశ్రమాచార సద్భావగుంభితమై నవీన హృదయాకర్షణార్థము శృంగార చరిత్ర నొప్పి భారతీయాంగనా పరమ పవిత్ర ప్రేమాదర్శముగ నీ పాత్ర ముంచుటయే ముఖ్యకారణము.

మఱియు నీ గ్రంథకర్త పూర్వభవకృత సుకృతవశమున నింతటి బాల్యముననే యొకవిధమగు కవిత్వపు ధోరణి కలిగి యుండెనేగాని తదుపబృంహకములుగ గురుకులంబున కావ్యనాటకాలంకార వ్యాకరణాది సామగ్రుల సేకరించియుండ లేదు. ఇక నాస్థితియన్ననో ప్రారంభముననే దృఙ్మాత్ర రూపముగ విశదమయ్యెగావున సర్వసమరస పండిత నిరీక్షణము తత్తచ్ఛబ్దార్థాలంకారౌచితి ఛందోవ్యాకరణ నాటకలక్షణాది నిష్ణాత పండిత ప్రకాండ సవిమర్శ నిరీక్షణములకు సంపూర్ణావకాశము నొసంగునేగాని వారికి విశ్రాంతి నొసంగునది గాదు,

కావున విద్యార్థియు శ్రేయోర్థియునగు నీ గ్రంథకర్త మొదల సహృదయులగు తత్తత్కాలాలోవిదు లెల్లరు సంపూర్ణ వాత్సల్యముతో తమకు దోచిన దోషములనెల్ల పునర్ముద్రణానుకూలాశీర్వచః పురస్సరముగ నీతనికి దెలిపి నిర్దోషిని గావించి తమదోషజ్ఞతను సార్థక పరచుకొని యిటులె మున్ముందనేకసద్గ్రంథ రచయిత యగునట్లు యుష్మత్కరుణాపాంగ పండిత నిరీక్షణములచే కృతకృత్యుని గావింతురుగాత.

స్వస్థానము,
ఓంకార మందిరము,
(బెల్లంకొండ పోస్టు,
గుంటూరు జిల్లా.)
23—1—1937.

ఇట్లు సర్వశ్రేయోభిలాషి,
తర్క వేదాంత విశారద,
ముదిగొండ వేంకటరామశాస్త్రి.

---

# పండితాభిప్రాయములు

శ్రీరామచంద్రాయనమః

శ్రీ దేవరసెట్టి కాశీవిశ్వనాథగుప్తగారిచే రచియింపఁబడిన "పుష్పహాస" యను రూపకమును గాంచునవకాశము నాకు కల్గినది. నాటకరచనమునందు ముఖ్యాంశమగు కథా సంవిధానమును దానిని వీరు చక్కగానే పోషించియున్నారు. వయస్సునందు మిక్కిలి పిన్నలయ్యును వీరీ యుద్యమమునఁ గృతకృత్యులగుట ముదావహము. వీరి పద్యరచనయును మనోజ్ఞముగానే యున్నదన నగును. పరమాత్ముఁడు వీరి కాయురారోగ్యభాగ్యము లొసంగి వీరికను అనేకములగు సద్గ్రంథములను రచించున ట్లనుగ్రహించుగాక.

మదరాసు,
7—8—37.

శ్రేయోభిలాషి,
దోమా వేంకటస్వామిగుప్త.

# పండితాభిప్రాయములు

మహారాజశ్రీ దేవరసెట్టి విశ్వనాధమునకు
రావిపాటి లక్ష్మీనారాయణ గావించు విన్నపము.

అయ్యా,

తమ రాదరపూర్వకముగా నంపిన లేఖయు, ముద్రితపత్రిము లందినవి. చదివితిని. కథయూ నూతనము, పద్యములు రసవంతములై లలిత పదాలంకృతములై, భావప్రధానములై యున్నవి. శైలి మనోహరముగా నున్నది. ఇట్లే కల్పనా చమత్కృతులతో సరసములగు నూతన భావములతో మఱికొన్ని గ్రంథముల రచించి, భాషాసేవ జేయ గోరుచున్నాను.

గురజాల,
27—7—37.

ఇట్లు విన్నవించు
రావిపాటి లక్ష్మీనారాయణ

---

శ్రీయుతులు

దేవరసెట్టి కాశీవిశ్వనాధగుప్తగారు,
బెల్లంకొండ.

కవిసోదరులకు—

రస మూరన్ మృదులరచనారమ్య భావప్రసాదం
బసలారుం దెనుగునుడి యొయ్యారముల్, కూర్పుతీర్పుల్
పొసగ, న్నే కొరత బొరయంబోని పాండిత్యముల్ నీ
వసమాతన్! కులుకు లొలుకన్ భావికావ్యమ్ము శ్రేష్ఠీ!

ఆదివారప్పేట,
ఏలూరు.
31—7—37

భవదీయుడు,
బొడ్డు బాపిరాజు.

శ్రీరస్తు  శుభమస్తు

# అంకితము

సీ. విశ్వంభరాభార విధ్వంస సార్థమై, పుడమి మానిసివోలె బొడమి విశ్వ

నాయకు దశరథునకును రక్షించని, ష్ప్రుకు కౌశికు జన్నము వధ

కడిమి నొనర్చియు క్రతువినాశి బిసరు, హాత్మీ నహల్య నెయ్యమున గని వి

కృతశాపమునుమాన్పి సితికంఠు విలుద్రుంచి సతిగ గ్రహించియు సాధ్వి సీత

తే. గీ. సీమ విడి కైకచే వని జేరి దర్పి

తారిచే బడ సతి యిన తనయు ఘనత్రే

రారి జంపి జలధి దాటి యసురకులము

మాపి సతి గొను హరికి సమర్పణంబు.

# ఇందు వచ్చు పాత్రలు



**పురుషులు:—**

ధనంజయుడు—సింధువార నగరాధీశ్వరుడు

దేవముఖుడు— నూతనమంత్రి

సుందరకుడు—రాజకుమారుడు

పుష్పహాసుడు—కథానాయకుడు

నారిగాడు యూరిగాడు—దొంగలు

గుహుడు—బెస్తవాడు

(మరి కొందరు భటులు)

**స్త్రీలు:—**

లలిత—కథానాయిక

తిలక—లలిత చెలికత్తె

మదనమంజరి —రాణి



ఓం.

అవిఘ్నమస్తు.

శ్రీ సీతారామచంద్రాయ నమః.

# పుష్పహాస



## నాంది

ఉ. శ్రేయమె? నా యురంబున వ - సించుట మా సతి వీవె యన్న నా
థా! యనురాగ సంగ్రహ ని - ధానము భర్తమె, యట్టివాని నే
నా యెడబాసియుంట? ఘ - నంబగు మీ చతురోక్తులన్న న
బ్జాయతనేత్రి నాయదె ని - పంబని ముద్దిడు శౌరి బ్రోచుతన్.

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి సభాసదులపై
పుష్పాంజలిం జల్లి)

సూ—నాటకావలోకన కుతూహలచిత్తులై ప్రేక్షకమహాశయు లందరు రంగస్థలమునకు నియమిత కాలమున కేతెంచిరి. నటిమాత్ర మింకను రాదయ్యె.

(అంత చేత నొక పత్రికతో నటి ప్రవేశించును)

నటి—ఆర్యా! నమస్కారము. ఆలస్యమునకు క్షమింపుడు.

సూ—ప్రియా! అలసగమన మాడువారి కలంకారమెగదా? ఇక క్షమాపణ యేల?

నటి—అవును. ప్రియురాండ్ర యపచారశతంబుల కిట్టి విపరీతార్థములనే ప్రియులు కల్పించవలె. లేనిచో సంసార శకటంబు సాగు టెట్లు? ఇంతకు ప్రదర్శనమున కే నాటకమును నిర్ణయించితిరి?

సూ—అందు నీ యాలోచనా సాహాయ్య మొకింత యావశ్యకంబు సుమా!

నటి—నాథా! బుద్ధిశాలురగు పురుషులకు పూబోఁడులా యాలోచన చెప్పుట.

సూ—ప్రేయసీ! పరస్పరాలోచనా పరతంత్రత లేని దాంపత్య ప్రణయ మెంతటిది? సరి కాని ఆ పత్రిక యేమి?

నటి—నాటకప్రదర్శన సమయమున నన్నే దేని యొక ఋతువర్ణన యందు నియోగించుట మీ కాచారమగుటంజేసి, ముందుగా నే నావర్ణన నీ పత్రికయందు వ్రాసికొంటి.

సూ—ఏ ఋతువును గురించి వర్ణించితివి?

నటి—వసంతఋతువును గురించి.

సూ—ఓహో! ఋతురాజమును గురించియేనా? ఏదీ చదువుము.

నటి—మీ నాటక నిర్ణయానంతరముగదా, నా వర్ణనము.

సూ—(నవ్వుచు) ఇందు పూర్వాపరదోష మేమియు నాపాదింపదు. చదువుము.

నటి—దోషమైనను, భర్త్రాజ్ఞాపరిపాలనంబు మానవతికి పరమ ధర్మంబు గదా!

సూ—అవును. సాధ్వీరత్నముల కంతకన్న సౌభాగ్య మేమి? చదువుము.

నటి—చిత్తము. (చదువుచు)

మ. లలితాలాపపికాళి సంచయము ఫు - ల్లాంభోజమాకంద స
త్పల నానావిధపుష్పహాసము లతాం - తామోద సౌరభ్యము౯
తిలకాశోక ధనంజయాగ్రముఖ పృ - థ్వీజాతనూత్నాంగ మం
జుల తేజమ్ము వసంతవైభవము చ - క్షుఃప్రీతికందం బగు౯.

సూ—(సంతోషముతో) ప్రియా! ఆహా! సమయమున కెంత చక్కగా పాత్రల విశదీకరించి నాటకం బొందు జ్ఞప్తికి దెచ్చితివి?

నటి—(ఆశ్చర్యముతో) నాథా! పాత్రల విశదీకరించు టేమి? నాటకం
బెండు జ్ఞప్తికి వచ్చు టేమి?

సూ—అవును. నీఋతువర్ణన వినుటచే కాకతాళీయముగా "పుష్ప
హాస" యను నూతననాటకంబు స్ఫురించె.

నటి—ఎటుల?

సూ—ఆ "పుష్పహాస" యను నాటకంబున నాయికా నాయకులగు
"లలితా పుష్పహాసులు" ప్రధాన పాత్రలగు "శిలకాధనం
జయులు" అను పదంబులు అన్వార్థకంబులై నీ వర్ణనయందుం
డుటం జేసి.

నటి—(సంతోషముతో) నాథా! ఆనాటకం బెవరిచే వ్రాయబడియె?

సూ—వినుము.

మ. ధర విద్వన్మణిసత్కవీశశశిభ - క్తశ్రేణిపాదాబ్జ పా
శిరజోభాసిత శీర్షభాగుడు, కృపా - లీఢాన్నపూర్ణాసతీ
నరసింహార్యతనూభవుండును, జగా - నన్ దేవరశ్రేష్ఠి సు
స్థిరవంశోద్భవుచే రచింపబడె కా - శీవిశ్వనాథాఖ్యుచే.

నటి—(నవ్వుచు) సరే బాగున్నది. కవి నూతనుడు, కథ నూతనము, నట
కులా ప్రేక్షకులకు నూతనులు. మరి యిన్ని నూతనములైన
నాటకము తిన్నగా సాగుననియే మీ రూహించితిరా? పోనిండు
నాటకమైనను రసవంతముగా నుండునందురా?

సూ—బేలా! నాటకము రసవంతమా యని యడిగెద వేల? నటకులు
రసికులా యనుము. పద్యగద్యము లెటు లున్నను, రసపోషణ
భార మంతయు నటకులదని ఎరుంగవా యేమి? కాని మన యీ
పురాణము నిక కట్టి పెట్టవలయు. లేనిచో ప్రేక్షకుల కరతాళ
ముల పాలగుదుము.

నటి—అయిన నిక నేగుదము రండు.

సూ—నటీ! మరచితి. (సభవైపు తిరిగి) సభాసదులారా! నాటకప్రద
ర్శన సమయమున తమ కందరకు తన విన్నపము నిట్లు విశదపరచ
వలసినదిగా గ్రంథకర్త నా కాజ్ఞాపించియుండె, వినుడు.

ఉ. పండితవర్యులార! కవి - పార్థివ శేఖరులార! భక్తవే
దండములార! మద్విరచి - తం బగు నాటకమందు లోపముల్
మెండుగ నున్న సైచి నను - మిత్రునిరీతిగ నెంచి సారమం
దుండిన గ్రోలుడయ్య! అది - యున్ గనుపట్టమి సైచు డెట్టులో

ప్రియా! అల్లదే ధనంజయ మహారాజుగారును, నూతనమంత్రి సత్తముం
డగు దేవముఖుండును, సభామండపమున కేతెంచి యున్న
వారు. మన మింకేగుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)



ఓం.

శ్రీ సీతారామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# పుష్పహాస

## ప్రథమాంకము



సింధువారనగరము - రాజసభాభవనము

(రాజు = ధనంజయుడు. మంత్రి = దేవముఖుడు ప్రవేశము)
(ధనంజయుడు విచారగ్రస్తుడై యుండును)

దేవా— దేవా! ధనంజయమహీరమణా! షోడశకళాపరిపూర్ణంబగు చంద్రబింబంబుడంబు విడంబించు మీముఖంబు ధూళిధూసరంబగు రత్నంబు కైవడి శోభావిహీనమై గనంబడు. రాజాధిరాజచంద్రుండవగు నీ కేమి కొఱంత గలదు?

మ. ధనమా మూలల మూల్గుచున్నయది వి - ద్యాసద్యశోవల్లియా?
ఘనదిగ్భిత్తుల బ్రాకజొచ్చె బలమా - గన్పట్టె దేతాదృశం
డనిలో; రూపము కామినీహృదయమో - హారంభసంరంభమా,
తనయుం డాత్మజ యుద్భవించిరి అప - త్యం బన్న నోరాణ్మణీ!

ధనం—అమాత్యశేఖరా!

శా. సంతానార్థము కొన్నిరోజులును ద - త్సంతాన మెంతో రుజా
వంతంబై తపియించ కొన్నిదినముల్ - వైవాహికానేకకా
ర్యాంతర్మగ్నత కొన్నినాళ్లు నిటు లా - యాచింతలన్ గ్రుంగనా
సంతానార్థికి వంతలేని త్రుటి యే - చందంబునన్ గల్గెదున్,

సకలసుగుణకదంబయు సమస్తవిద్యాసారపారంగతయు సర్వాంగ సుందరీ
మతల్లియు నగు నాకుమారి "లలితాకుమారి" వరాన్వేషణంబు
నం బడరానిపాట్లు బడుచుంటిగదా!

సీ. రాజ్యరమాపాంగ - లాలితుం డగునేని
బాహుబలోన్నతిఁ - బడయకుండు
బాహుబలుండు భూ - భారధారియు నైన
సర్వశాస్త్రార్థముల్ - చదువబోడు
సర్వశాస్త్రార్థర - సాస్వాదనుండైన
రుచిరాంగముల స్ఫుర - ద్రూపి గాడు
సౌందర్యగాత్రసం - స్తవపాత్రుఁడేయైన
సుగుణసంపత్తిచే - జుట్టబడడు
గీ. ఇన్ని గుణములు గలుగు సం - పన్ను సతము
వెతకి వెతకి వేసారి ని - స్పృహుడనైతి
నస్మదాత్మజ పరిపూర్ణ - యౌవనాంగి
తరుణి లలితామణికి తగు - వరుని భువిని.

హా దైవమా! భిక్షుకుని మొదలు సర్వసర్వంసహాచక్రతలం బేలెడు
రాజ రాజేశ్వరునికైనను నొక్కొకపరి మిక్కుటమగు నిక్క
ట్టుల నక్కజంబుగ గల్పింతువుగదా! హాసోదరీతిలకమా!"గంధ
ర్వదత్తా!" ఇప్పట్టున నీవును నీముద్దులబాలకుండును జీవించి యు
న్నచో నేనీ యపార దుఃఖ పారావారతరంగంబుల నీదులాడ
వలసిన వాడ గాకుందుగదా! నీమురిపెముల కూటమియగు
కొమరునకు ముద్దులమూటయగు నా కొమరిత నిచ్చి యత్యంత
వైభవముగా వైవాహికాదు లొనరించి నేత్రపర్వముగా దిల
కించు భాగ్య మీయభాగ్యునకు లభించునా? హా "గంధర్వ
దత్తా" (అని విచారించుచుండును)

దేవ—దేవా! తమసహోదరీ రత్నం బీ లోకముఁ బాసి దివంగతు రాలగుటకుఁ గారణం బెద్ది?

ధనం—మంత్రిసత్తమా! దేవముఖా! అప్పటివారి యవస్థం దలంచుకొన నెంతటి ధీరమానసంబైనను పటాపంచలు గాకయుండునే!

ఉ. ముద్దులుమూటగట్టునగు - మోమునఁ గ్రాలెడు నందనుండునుఁ
దిద్దియు మారునారికిని - దీర్చెడువంకలు ధర్మపత్నియుఁ
బెద్దయు ముద్దుగూర్పు వృధి - వీపరిపాలనతత్పరుండునై
ప్రొద్దులుపుచ్చు బావయు య - ముందు మదిఁ సహియింపమిఁ కటా

అంత నొకానొక దివసంబున,

మ. నడురేయిన్ జనుదెంచి శాత్రవులు న - న్యాయాత్ములై పాన్పుపై
బడి నిద్రించెడు నాదుబావను కృపా - బాహ్యాంతరంగంబులఁ
కడిమిఁ ఖడ్గపరంపర న్నరికియుఁ - ఖండంబులై కాయ మీ
పుడమిఁ డొల్లగ ద్రెళ్ళనేసిరి దురా-త్ముల్ రాజ్యకాంక్షోన్నతిఁ

అంత మత్సహోదరియగు నక్కాంతారత్నంబు చింతానలదందహ్యమానమానస యౌటయేగాక, భర్తృసహగమనాకాంక్షిణియై ప్రజ్వలానల జ్వాలలఁబడి ప్రాణపరిత్యాగమున్ జెంది ప్రాణేశునిన్ బొందెనని తెలియవచ్చె.

దేవ—హరి, హరీ! ఎంతకష్ట మెంతకష్టము! ధరావల్లభా! మీ మేనల్లుండగు న బ్బాలుం డేమయ్యె?

ధనం—సచివవరా! తదాది యేతద్దివసపర్యంతము వర్షత్రయవయస్కుండైన మన్మనోభాగధేయుండగు భాగినేయుండు సజీవుడై యుండునో లేదో యను శంకచే డోలాందోళిత మానసుండనై జాలి దూలుచుంటి. అక్కటా! ఎక్కడెక్కడ వెతకించినను నక్కుమారుని జాడయే చిక్కదయ్యె.

చం. చనియెను షోడశాబ్దములు - సద్గుణచారిణి, సాధుభామినీ
జనమణి సోదరీమణిని - సాహసపుంగని నాదు బావనుఁ
గనుగవలోడ గాంచకను - గాంచగ నల్లుని నైన నోము, నే
మును నెపుడైన నోచితినో - పూని యొకప్పుడు నోచనైతినో.

దేవ—ధీరశిరోరత్నమా! సర్వజ్ఞులగు మీరు సామాన్య మానవునిబోలికఁ దురపిల్లుట భావ్యమా?

ఉ. పంకజసూతి వ్రాతలను - బట్టి శుభాశుభముల్ ఘటిల్లుచో
సంకటమంద దవ్వునొకొ - శార్ఙ్గికి నేనియు, భూరిధైర్య కూ
లంకషమీచి దేలక, ని - రంతరమున్ దపియింప జెల్లునే?
జంకుదురే భవాదృశులు? - చండతరారిమదేభసింహమా!

అదియునుంగాక కష్టంబులట్టే కాపురంబు జేయునా? కష్టసుఖంబులు కావడికుండలను నార్యోక్తి మీ రెరుంగనిదియా? అనంతునిలీల లతివిచిత్రంబులుగదా?

గీ. సతత సంతోష సౌఖ్య వి - శ్రాంతులైన
దుర్భరావేదపాథోధి - ద్రోయనోపు
దవిలి సంతాపవహ్ని సం - తప్తులైన
ప్రకటితానంద భర్మ - డోలికల నూపు.

కాన నేనాటికైన మీ యల్లుండు చల్లగా నున్నచో విరించి విధించి యున్నచో నడవి యుసిరికకును, నంబుధి లవణమునకును, జత గూరుచు విధాత మీముద్దు లల్లునకును మురిపెముల కూతునకును సంబాధంబు గల్పించి హర్షవర్షంబు వర్షించుననియే మదీయాశయంబు.

ధనం—అమాత్యవర్యా! ఎంతవఱకు మన్నను, ఆముత్రిత్రయంబు మరపునకు రాదుగదా? అది యటుండ, మన పట్టణవాసియగు గుహుండను కల్లైవానిచే నీయబడిన కంకణంబు నాసోదరి

"గంధర్వదత్త" ధరియించు వలయంబగుటచే నద్దానిం గాంచి నపుడెల్ల నాసంతాపవాహినికి మేర లేకున్నయది.

దేవ—మహీవల్లభా! భవదీయ సోదరీమణి ముంజేతి నలంకరింపబడు మణిమండనం బా పల్లవాని కెట్లు లభించె?

ధనం—ఎట్లు లభించెనో కాని వా డయ్యది కాన్కగా నొసంగిన పిమ్మట వానితో

గీ. ఏయుపాయంబుచే లభి - యించె నీ యు
పాయనం బన వాడు వి - భ్రాంతు డయ్యు
దొరకె సామీ! యటంచు త - త్తరముతోడ
భీతచేతస్కుడై తెల్పె - బెస్తవాడు.

పోని మ్మెట్లు లభించిన నేమిలాభం బని తలంచి వానితో నీ విద్దానిని మా యొద్ద జేర్చి నందుల కెద్దాని గోరిన నద్దాని నిత్తునన

గీ. తనదుపుత్రకు నఖలవి - ద్యారహస్య
వేదిగా సర్వసచ్ఛాస్త్ర - వేత్తగాగ
నలువగోరి సమర్పించె సచివవర్య!
రూపలావణ్యగాత్రు స - రోజనేత్రు.

దేవ—అన్నన్నా? మొన్న మొన్నదాక మీకన్న కుమారునితో పాఠ శాలల విద్యాభ్యాస మొనరించు పుష్పహాసుం డా యల్పుకు నాత్మసుతుండా? ఔరా! హీనకులజాతుం డయ్యు నాత డహీన సౌందర్య ఖనియై హిమాంశువును సైతము హీనకళాన్వితుఁ జేయుచుండెనే?

ధనం—మిత్రమా! దేవముఖా!

గీ. ధరణి సుందరపురుషసం - దర్శనంబు
గాని, తద్గుణశ్రవణంబు - గాని కలిగె
నేని భాగినేయుండు నా - లోన నాదు
కనుల మెలగుచు దుఃఖసం - కలితు జేయు.

అందునం జేసి యపారవిచారపారావార తరంగంబు లభంగతరార్భటిఁ పొంగి పొరలుచుండె; నిప్పట్టున సకల సంతాప సంహరణంబును నవిరళానందావిర్భావ కారణంబును నగు భీకరారణ్య ఘోరతర వన్యవినాశకరంబగు వేటదప్ప మరొండు శరణ్యంబు గానే రదు. ఎల్లి సూర్యోదయాత్పూర్వమే యేగవలయు. తగు సైన్య సాధనంబుల నాయత్తపరుపుము. పొమ్ము.

ధనం—ఈశా! రమేశా!

చం. ఒకపరి సోదరీమణి య - యో గతియించె నటంచు నేడ్తు నిం
కొకపరి యౌవనాంగి సుత - కుఁ దగు భర్త లభింపకుంట, నం
తకు తలవంతు నల్లుని వి - ధంబున కై తపియింతు నొక్కసా
రిక నను బ్రోతువో, పయిని - నెట్టి పిశంగు బడంగ జేతువో.

(నిష్క్రమించును.)

యవనిక జారును.

ఇది ప్రథమాంకము.



# పుష్పహాస



## ద్వితీయాంకము



### ప్రథమరంగము

(ప్రదేశము:- రాజసభాభవనము. ప్రవేశము పుష్పహాసుడు)

పుష్ప—(సభాప్రదేశమును తిలకించి) ఏమియాచిత్రము! నేడీ యోలగం బంతయు నిర్జనం బగుటకు గతం బేమి? రాజచంద్రుం డెందేగి యుండునోకదా? (పదధ్వని విని) ఈదెస నెవ్వరో వచ్చుచున్నట్లున్నయది. వారినైన నడిగి తెలిసికొనెద. (ఆవైపు చూపు నిగుడ్చి) ఓహో! ఎవ్వరో కాంతాతిలకంబువలె దోచుచున్నయది. అంతిపురాంగనయై యుండదుకదా?

(పుష్పహాసుడు చాటుగా నిలబడియుండును. అంత లలిత చెలికత్తెయగు తిలక ప్రవేశించుచు, పుష్పహాసుని చూడకయే)

తిల—(తనలో) గీ. అవని అతివయై పుట్టుటే - హైన్య, మందు
పొట్టకై వేచి పరుల నే - ప్రొద్దు గొలిచి
జీవనము వెళ్ళబుచ్చెడు - చేటికలను
గాంచ నేరికి జుల్కన - గాకయున్నె.

అబ్బా! యువరాజ మాత్రుండయ్యును, దాసదాసీ జనంబుల నిట్లు గాసిలంజేయు మా సుందరకుండు, మహారాజైన నికెట్లేడ్పించునో గదా! పోని మ్మబలల నేడ్పించు ఫలం బేనాటికే ననుభవింప కుండువా? ముందెన్నడో యననేల? మొన్న ననుభవించిన

శా స్త్రిచాలదా? అంతటి రాజసభలో నట్టి ధనంజయ సార్వ భౌముని తనయుండయ్యు నల్పకుల జాతుండగు పుష్పహాసునిచే నట్టు లవమానింపబడెనట. అంతకన్న నింకేమికావలయు? అదియే నాకు బ్రహ్మానందము. (వెడలుచు పుష్పహాసుని జూచి నిలువ బడి తనలో) ఎవ్వడీ పురుషసింహుడు. (ప్రకా) అయ్యా! తమ రెవ్వరు? ఇందు రాకారణం బేమి?

పుష్ప—నే నీ పట్టణవాసిని. రాజకార్యార్థమై యిట కేతెంచితిని. సకల సద్గుణ పుంజుండగు ధనంజయ సార్వభౌముం డెం దేగెనో తెలి యదయ్యె

తిల—వేటనిమిత్తమై విపినావని కేగిరట!

పుష్ప—ఎవరు తెల్పిరి? ... నీ వెవ్వరవు?

తిల—ఏను ధనంజయమహారాజు మురిపెంపు కూతురగు లలిత సఖు రాలను. నాపేరు తిలకయంద్రు. ఆబిడయే నా కట్లు తెలిపె.

పుష్ప— ( ఆశ్చర్యముతో స్వగ ) ఔరా! ఏమి యీాపెతనూవిలా సము!

గీ. దాస్యభామిని యయ్యు ని - త్తలిరుబోడి
గానబడు నిట్టు; లింక ని - క్కాంతచేత
సతము దాస్యంబునందు నా - సన్నుతాంగి
కామినీరత్న మిం కెట్లు - గానబడునో?

(ప్ర) కాంతా! భూనాథుండు వేటనుండి తిరిగి యెప్పుడు రాగలడో చెప్పగలవా?

తిల—తమ కాతేనితోగల కార్యం బెద్ది? భవదీయపవిత్రనామాక్షరంబు లెవ్వియో నే నెరుంగవచ్చునా?

పుష్ప—

ఉ. పంకజనేత్ర విద్యలను - ప్రాజ్ఞునిగా నొనరించి నామదిన్
సంకట మెల్ల బోవగను - సల్పి సతంబు కృపారసంబు నా
వంకను జిల్కుచుండు పరి - పంథివనార్చికి రాజమూర్తి కే
కంకణ మొందు కానుకగ - గైకొని వచ్చితి పుష్పహాసుడన్.

తిల—(ఆశ్చర్యముతో) ఏమీ! సకలవిద్యాభాసుండగు పుష్పహాసుండ వీవేనా? కంకణం బొండు గైకొనివచ్చితివా? మున్ను భవజ్జనకునిచే నొసంగబడిన వలయసదృశంబై యుండునా? ఏదీ యద్దాని నొకమా రిటు చూపుము.

పుష్ప—(అంగీలోనుంచి కంకణము తీసి తిలక కిచ్చును)

తిల—(కైకొని కాంచి) పుష్పహాసా! ఇదివరకు మీజనకునిచే నియ్యబడినదియు, నిదియు నొకరు ధరించునదియే. మరియు నిది తన మేనత్త వలయంబగుటచే నాస్నేహంపు మొలకయగు లలితయే కరమున గీలించి రెండవది గూడ నున్నచో బాగుండునుగదా యని యుత్సుకత్వంబు నొందుచుండుకాన నీ విద్దానిని నాచెలి కొసంగుచో రాజుగారికన్న మిన్నగా ని న్నామె బహూకరించ గలదు. అంతిపురమునకు పోవుదము రమ్ము.

పుష్ప—వెఱ్ఱిదానా! బహుమానకాంక్షినై కంకణము కతంబున నే తెంచితి ననుకొంటివా?

చం. అనుపమసద్యశోవిభవ - మందగజాలు సమస్తవిద్యలన్
దనిపియు గన్నపుత్రుని వి - ధంబున నన్గని మోదమందు న
జ్జనపతి కిద్ది యే నొసగి - సంతసమంద దలంతుగాని మా
నిని! మడిమాన్యముల్ గొనగ - నే మది నెంతు నె! ఏగుదెంతు నే.

అదియునుం గాక.

ఉ. మానము బోదె, పైన నవ - మానము రాదె, ఎవండు గాంచినన్
చానరో! పోవగాదగునె! - సాహస మూనియు వెన్కముందు నెం
తేనియు జూడ కెప్పుడును - నెట్టిమహత్తర కార్యభార మే
నూనియు, రాణివాసమున - కొంటరిగన్ పరపూరుషుం డహో?

తిల—పుష్పహాసా! పురుషసింహుడ వయ్యును, భీరువువోలె నటింతు వేల? (నవ్వుచు) అబలల గాం[illegible] వడంకు నీవు బలుల నొంచ నెట్లోపుదువు?

పుష్ప-ఇంతీ! శుద్ధాంతకాంతావలోకనం బతివిరుద్ధంబుగాదా? (తనలో) పాప మీమె యింత నిర్బంధించుచుండ వెడలినం దప్పేమి?

తిల—సరే, అటులయిన లోన ప్రవేశించుట నీ కిష్టము లేనియెడల ద్వారమీవలనే యుండుము. ఆవల యేనావలయమున్ గొని లోన మా చెలి కొసంగెద రమ్ము.

(తెరలో) చెలీ తిలకా! లలితమ్మగారు నిన్ను సత్వరముగా బిలుచు చున్నారు.

తిల— పుష్పహాసా! అల్లదే నన్ను మా చెలి బిలుచుచుండె రమ్ము. రమ్ము. (అంత నిరువురు నిష్క్రమింతురు. పోవునపుడు పుష్ప హాసుని చేరుమాలు అందు జారిపడును.)

యవనిక జారును.



## ద్వి తీ య ర ం గ ము

(లలిత యంతఃపురము. లలిత యొకానొక వేదికపై నాసీనయై గ్రంథం బెద్దియో యవలోకించుచుండును.
తిలక ప్రవేశించును.)

తిల—(లలిత సమీపమున కేగి) సఖీ! సఖీ! నన్నేల సత్వరంబుగా పిలిపించితివి?

లలి—చెలీ! నీవు నాదండ నుండమింజేసి యెుండేమియుఁదోపమినిందు మనంబుతో గ్రంథం బొండు గాంచుచుండ, సంశయంబొండందు దోప నీ వుండుచో నద్దానిని జెండివై తువుగదాయని ఖండితంబుగా నట్లు బిలిపించితి. నీ సంతసం బంత యింతయన కంతులేనిదై గంతులిడుచున్నదని నీమోము పంతమూని వింతనవ్వుచే నీ వెంతదాచిన నంతయుం జెప్పుచున్నయది. వింత లేమి?

తిల—నెచ్చెలీ! న్నాయీ సంతోషము నీ రొట్టె విరిగి నేతిలో బడుటయే!

లలి—అద్దిరా! నే నద్ది యడిగినను నద్ది నామీఁదికే ముద్దుముచ్చటగా దెచ్చిపెట్టుచుందువుగదే.

తిల—నీ పనినటుల నే తెచ్చితిని గాని యిక........

లలి—(ఆశ్చర్యముతో) ఏమి దెచ్చితివి?

తిల—"కంకణము"

లలి—కంకణమా? ఎట్టి కంకణము? ఎందు దెచ్చితివి?

తిల—(లలిత హస్తమందుండు నిదివరకు కంకణముబట్టి చూపుచు) నాడీ కంకణ మొసంగిన పల్లెవాడు నే డిట్టిదానినే మరియొకదానిని తన కుమారునకిడి మీతండ్రిగారికి సమర్పించవలసినదిగా బుత్తెంచె.

లలి—ఆత డెందుండె? కంకణంబు గైకొని వచ్చితివా?

తిల—లేదు. ఆత డా ద్వారమావల నుండె.

లలి—సఖీ! తత్ క్షణంబు వెడలి యా భూషణంబుమాత్రి మీయెడకున్ గొనిరమ్ము. పిదప తగిన పారితోషికం బిచ్చి యాతని వంపెదవు గాక పొమ్ము.

తిల—(స్వగతము) ఆ సొగసుకాని చెలువ మీ లలనకు జూపనెంచి వలయు మా వయసుగానియొద్దనే యుంచితినిగదా? ఇప్పుడిమ్మగువ యమ్మండనంబు మాత్రమే కొనిరమ్మనుచున్నయది. నా తలంపు ఫలించు టెట్లు? (ప్రకా) చెలీ! ఎంతబేలవే? యాతం

డద్దాని నిచ్చుచో నప్పుడే కైకొని రాకయుందునా? తానది యొరుల కొసంగడట! స్వయముగా నీయవలెనట!

లలి—అటు లయిన నాతం డంతిపురంబున కేతెంచు టెట్లు?

తిల—అంతిపురాంగనల కిష్టమైన నంతిపురం బడ్డగించునా యేమి?

లలి—సఖీ! పరపురుషదర్శనం బతిపాపహేతువు గదా?

తిల—పరపురుష దర్శనంబున బాపం బొదవుగాని పరపురుష వస్తుధారణంబున బాతకంబు ప్రాప్తించదు గాబోలు. పాపము తనసోదరుని స్నేహితుండైనను రాజనదట. అబ్బా! యేమి [illegible] వాసము! సరే, నాముల్లె యేమి మునిగినది. రాజు వచ్చిన పిదపనే రమ్మని చెప్పెద. (పోబోవ)

లలి—(పట్టుకొని) చెలీ! చెలీ! మాటవరుస కటు లంటినిగాని "సిరిరామోకా లొడ్డువా రుందురా? వేగమే యాతని నిందు ప్రవేశపెట్టుము.

తిల—(వెడలుచు తనలో)

గీ. భళిర! యిటు లుండవలె యుక్తి - పన్నకంబు
ఒరుల కత డీయు డటయంచు - నువిద కిచట
నుడివి యొరులచే నీపె గొ - నుటకు నోప
దంచు నవ్యలావణ్య ర- క్షించి మింతు.

(నిష్క్రమించును)

లలి—దీన నెద్దియేని ముప్పు వాటిల్లదుగదా? (గ్రంథముం గాంచుచుండును. అంత తిలకయు, కంకణంబు చేత నిడుకొని పుష్పహాసుడు ప్రవేశింతురు. తిలక కొంతదూరమున పుష్పహాసుని నిలిపి)

తిల—పుష్పహాసా! ఆకనంబడు కన్నెమిన్నయే నానెయ్యంపు నిలయమగు లలిత. (లలిత సమీపమున కేగుచుండును)

పుష్ప—(లలితం గాంచి యాశ్చర్యరసనిమగ్నుడై) ఆహా! ఏమి యీ యెలనాగసోయగము!

మ. తళుకార్మేల్మి పసిండిబొమ్మయొ, రతీ - తన్వంగియో భోగినీ
లలనారత్నమొ నిర్జరాంగనయొ, లీ - లన్ భూమి క్రీడించు శ్రీ
జలజాతాక్షియొ, యక్షసుందరియొ, ప్రాం - చద్భూషణౌఘంబు భా
సిల వెల్గొందుచునుండె నింతి యదిరా - సీమంతినీరత్నమై.

గీ. కౌదమభృంగంబు లనగ ముం - గురులు వ్రాలి
ముఖసరోజంబునందున - మురుపు జూప
వఱలుచుండెను నవరగీ - ర్వాణివోలె
లలిత లలితాంగియే గాక - యలతి యానె.

తిల—(లలిత సమీపమున కేగును)

లలి—(తలయెత్తి) సఖి! కొనివచ్చితివా?

తిల—(పుష్పహాసుని వైపు చూపును.)

లలి—(పుష్పహాసుని గాంచి విస్మయావేశమున) చెలీ! చెలీ! ఆ త్రిజగన్మోహనాకారు డెవడే? ఆత డిందేల యరుదెంచె?

తిల—నీవు రాగోరిన బెస్తవా డాతడే నమ్మా!

లలి—(అచ్చెరువుతో) ఏమి? యీ సుందర సుకుమారగాత్రుం డా బెస్తవాడా? (స్వ) ఔరా! జాలరియైన ప్రాజ్య సామ్రాజ్యాధీశ్వరచిహ్నములతో బ్రకాశించునా?

గీ. అలఘుసౌందర్యమున నీత- డసదృశుండు
జానులంబితబాహుండు - సర్వభూమి
పాలనార్హుండు సువిశాల - ఫాలు డీత
డల్పజాతుండె నమ్మగా - నగునె మదిని.

తిల—సఖి! ఈతని రూపమునకే యింత యచ్చెరువందిన నిక నితని వైదుష్యంబున కెంత విభ్రాంతి నొందెదవో కదే?

లలి—అటులయిన గౌరవార్హుడే. ఆ తిన్నెపై గూర్చుండుముసుము.
(పుష్పహాసుని చూచుచుండును.)

తిల—(స్వ) సరే. ఇక నేను డొల్లు పుచ్చుకాయ పదవికి జేరవలెను గాబోలు (ప్ర) పుష్పహాసా! నీ వా తిన్నెపై గూర్చుండుటకు మా చెలి కోరుచున్నయది.

పుష్ప—(తిన్నె సమీపమునకు వెడలుచు, స్వగతము)

ఉ. కాంతల కెల్ల మేటి నిల - గల్పన సేయ విరించి తీవ్రమా
పంతము బూని సంతతము - పాటవ మెల్లను ధారవోసి యీ
యింతి సృజించెనేమొ, యటు-లేయగు నౌర? యటుండ దేని యీ
వింతమెఱుంగు లీ హొయలు - విశ్వమునందున గల్గు నేరికిన్?
(తిన్నెపై గూర్చుండును)

తిల—(స్వ) ఆహా! ఏమి యీ నిరుపమానసుందరయుగళము!

ఉ. ఈ రమణీలలామ కెన - యీతడె యీ సుకుమారగాత్రు సం
సారిణియై ప్రసూనశర - శాస్త్రవివాదము చేయనోపు, శృం
గారమయాంగి యీమెయె, జ-గంబున పూజ్యుడె పో విధాతయున్
ఈ రమణీయయుగ్మమున - కే విధియించ సతీపతిత్వమున్.

ఏమో భావికాల పరిస్థితిం బరికించ నేటితరంబు. ఇదమిత్థమని నిర్ణయించు టెట్లు? (అని యొండొరుల గాంచు లలితా పుష్పహాసుల గాంచి) (స్వ) ఓహో! వీరి పరస్పరాలోకనం బంతకంతకు మించి మితిమీరిపోవుచున్నయది. ఆ.........ఇప్పుడు వీరి యవస్థ దిలకించ నా యావంత కౌరంతయు గుంట బెట్టి గంట వాయింతురనియే తోచుచున్నయది. (ప్ర) పుష్పహాసా! ఏమట్లు తెల్లబోయి నిరీక్షించుచుంటివి? ఇందలి చిత్తరువు లంతటి యాశ్చర్యముం గలిగించుచున్నయవియా?

పుష్ప—(చూపు మరల్చుకొని స్వ) ఔరా? ఎంతటి జాణవే. (ప్ర) అ
వును. మున్నెన్నడును నిట్టి చిత్రవిచిత్ర ప్రతిమల నెందును
గాంచి యెరుంగనందుచే నామది కమితాశ్చర్యము వొడము
చున్నయది.

తిల—అటులనా? (లలితతో) చెలీ! ఏమట్లు ఆతురతతో దిలకించుచుం
టివి? అంతటి మోహ మున్న దానవు చేపట్టరాదా?... వలయము.

లలి—నెచ్చెలీ! ఆకటకంబు దాల్చు నుత్సుకత్వంబు నన్నట్లు నేగిరించు
చున్న యది. సత్వరం బద్ది గైకొని రమ్ము.

తిల—(పుష్పహాస సమీపమున కేగి నవ్వుచు) వలయ మిత్తువా?

(పుష్పహాసుడు చిరునవ్వుతో కంకణము తిలక కిచ్చును. తిలక లలిత
కీయ లలిత యిటునటు త్రిప్పి చూచుచుండును)

పుష్ప—(స్వ) ఔరా! యీమోహనాంగి సౌందర్యామృతంబు నేత్ర
పుటంబుల నెంత గ్రోలినను తృప్తియును మాట లేదుగదా?

సీ. సారసంబుల గేరు - సకియకన్నులతీరు
నీరదంబుల మీరు - నారి కురులు
కారు చీమలబారు - వారిజాననయారు
చారు శ్రీకారంబు - శ్రవణయుగళి
ఇందుబింబ సమంబు - సుందరాంగి ముఖంబు
కాముువిండ్లను బోలు - కాంతబొమలు
కీరమంజులరక్తి - మీఱు నీ ప్రమదోక్తి
రంభోన్నతిని మించు - రమణియూరు

గీ. లహహా! దివ్యమోహినివోలె - నలరుచుండె
త్రిజగములలోన నెవ్వ డీ - తీవెబోడి
అధరసుధ గ్రోలి సుఖవార్ధి - యందు దేలు
నతడె ధన్యుడు; అతడే - నుతయశుండు.

గీ. తరుణిపలుకులు మీగడ - తఱకు లరయ
లలనచూపులు మదనుపూ - ములుకు లౌర!
కాంతనవ్వులు వెన్నెల - కాంతు లహహా!
ఇట్టి మోహిని జేపట్టు - జెట్టి యెవడొ?

(చిత్రవిభ్రమ మందుచుండును)

లలి—(కంకణంబు రెండవ కంకణంబుపజ్జ నిడి) సఖి! ఇప్పు డీ కటకం బెంత సొగసుగా నున్నదో కనుగొనుము. మున్ను దీనిజోడు లేమిచే నింతగా శోభించినదిగాదు సుమా?

తిల—కాదటమ్మా మరి? ఎందును జోడుండిననేగదా అప్రతిమానశోభతో విలసిల్లుట.

లలి—(నవ్వుచు) చాలులే నీ చతురత్వ మిక కట్టిపెట్టుము ... చెలీ! దీనిని విడదీయ నాశక్యము గాకయున్నయది. నీచేతనైన విడదీయుము. (కంకణ మిచ్చును)

తిల—సఖీ! నా కెందునను సమకూర్చు సన్నాహమేగాని విడదీయు తలంపు నాయది కాదు. ఐన చూచెద (అని చేతగాని దానివోలె నటించి పుష్పహాసు జూచి) పుష్పహాసా! ఇద్దాని నమర్చ మా యిరువురికిని శక్యంబు గాకయున్నది. నీ కేమైన నలవియగునేమో తిలకించుము. (కంకణ మిచ్చును)

పుష్ప—(కైకొని) తొయ్యలీ! మీయిరువురకన్న నే సంతటి నేర్పరినా? ఐన భవదాజ్ఞానుసారినై ప్రయత్నించెద. (అనివిడదీయును)

తిల—చెలి! లలితా! కరం బటు సాచుము, కంకణము గిట్టిపోగలదు.

లలి—(కోప మభినయించుచు క్రీగంట చూచును)

తిల—అదేసమ్మా! కంకణముబెట్టుట. అబ్బా! నీ కన్నియును తప్పులే

(అని లలితచేయి బట్టుకొని పుష్పహాసున కందీయును)

పుష్ప — (కరగ్రహణ మొనరించి హర్ష పులకితగాత్రుడై స్వగతము)

గీ. గతభవార్జితపుణ్యసం - గత మదెంత
రాశియో కద్గ లభ్యమా - రమణిమిన్న
దర్శనం బన్న, గల్గెబో - స్పర్శనంబు;
భాగ్య మనగను నాయదే - భాగ్య మహహా!

(కంకణము బెట్టుచు)

గీ. భువనమోహినియైన యీ - పూవుబోడి
కరమునందున బెట్టగా - కంకణంబు
నేటి కొనగూడె నింక నే - నాటి కగునొ
గళమునందున సూత్రంబు - గట్టు టదియు!

(చేతికిం బెట్టి, ప్రకా) మత్తకాశినులారా! నే నిక పోయివత్తు సెల వొసంగుదురా?

లలి — చెలీ! తిలకా! వీని కేమి పారితోషికము గావలయునో అడుగుము, వేగిరం బొసంగుదము.

తిల — పుష్పహాసా! నీవాంఛితం బెద్దియో విశదీకరింపుము, నీకోర్కె దీర్ప నీకాంత వేచియున్నయది.

పుష్ప — (గ్రహించి నవ్వుచు) సుందరీమణులారా! పారితోషికం బిచ్చెదువా రెంతైనను నడిగి యిత్తురా?

లలి — సఖీ! అటులయిన యీ పచ్చలహారం బొసంగుము. (అని మెడలోని హారము తీసి తిలక కొసంగును.

తిల — మోహనాంగా! ఇదిగో. ఇప్పటికీహారం బట గైకొనుము. (ఈయ బోవును)

పుష్ప — (లలితం గాంచుచు మందహాసముతో) శృంగారగాత్రీ! ఇట్టి హారంబులు కోటియైనను మన్మనోరంజకంబులు గానేరవు. మీ సంపూర్ణానుగ్రహ మున్నచో నదియే చాలు. దయమాత్ర ముంచు

డు. పోయివత్తు. (వెడలుచు తిరిగిచూచును. అంత లలిత క్రీగంట చూచుచుండుట గని, స్వగ)

గీ. చెలియశృంగారవీక్షణ - శృంఖలముల
మత్పదంబుల బంధించె; - మద్వివేక
విమలవిజ్ఞానశస్త్రంబు - వృధయె తలప
దునుమజాలదు అద్దిరా - తుప్పు వట్టె.

లలి—(కొంతవడి యూరకుండి,నిట్టూర్పుతో) సఖీ!

సీ. కామినీ కాముకుల్ - కమలారికై కాన్క
బంపుచుండెడి చూత - ఫల మనంగ
చివురుటాకుల బూన్చి - శ్రీసూనుకై వసం
తుం డంపు పుష్పక-రండ మనగ
లీలమై బశ్చిమ - బాల క్రీడించెడు
కాంచనమయ కందు-కం బనంగ
విరహిణుల్ ప్రార్థింప - మరునికై విప్పిన
నీలకంఠుని ఫాల - నేత్ర మనగ

గీ. కలువకాంతలు తరుమగా - కనలి కనులఁ
దరణి అరుణకిరణములు - ధరణి బరపి
రేపు జూపెద నాపస - రూపు మాపి
మాడ్చి మసిజేతు నంచును - మఱలి చనియె.

తిల—ఏమి? పద్మినీ మనోహరుం డరిగెనను మంటివా? లలితా మనోహరుండు మాత్ర మరుగ లేదా? సఖీ! శయనాగారమే నీ కిక శరణ్యంబు, రమ్మ. (ఇరువురు నిష్క్రమింతురు)

యవనిక జారును.



## తృతీయరంగము

(ప్రదేశము-రాజసభా భవనము. ప్రవేశము-సుందరకుడు.)

సుం—ఛీ ఛీ, నాబోటి దౌర్భాగ్యుడీత్రిభువనముల గాలించి వెదకి నను కనంబడుట దుర్లభము.

సీ. కందుకంబులలీల - కంఠంబు లాడించు
వీరరసోన్నతిక - వెలయు కులము
ప్రాణంబు బోనున్న - పగతురవిడువని
పౌరుషస్థానమై - పరగు కులము
బ్రహ్మాండభాండముల్ - పైబడ్డ జంకక
ధీరత్వనిలయమై - తెగడు కులము
శిష్టరక్షణ దుష్ట - శిక్షణ దక్షతక
సర్వభూతల మేల - జాలు కులము

గీ. అట్టి సుక్షత్రియాన్వయం - బందు మాన
ధనుడగు ధనంజయ మహీశు - తనయుడయ్యు
చేప లమ్ముచు జీవించు - చెనటి యొకడు
గెలి సల్పిన సైపంగ - జాలి తకట?

(పుష్పహాసు నుద్దేశించి) ఔరా? పుష్పహాసాధమా!

గీ. నేనె విద్యల నన్నింట పూని - గెలిచి
రాజపుత్రుని నోడించి - రహిని గీర్తి
గొంటి నంచును సభలోన - కుటిలమతిని
నవ్వి తౌరార నీమేని - క్రొవ్వు దీయ.

(అంత కోపముతో నిటునటు తిరుగుచుండ చేరుమాల యొందు పాదం బునక దగుల గైకొని కాంచుచుండును. ఆసమయమున వేరొక వైపునుండి పుష్పహాసుడు ప్రవేశించును)

పుష్ప—(స్వగ, సుందరకుని జూడక యే,)

గీ. సర్వవిద్యల నేర్పించి జనకుఁవోలె
నాదుసేమంబు నరయు భూనాధుతనయ
యంచు నెంచక మదిని కామించి తౌర
చంచలాక్షి విలాసాదు లెంచి యెంచి.

ఔరా! మోహ మెంత చెడ్డది!

చ. తలపగనీదు వావి కుల - ధర్మ మొకించుక యోచనీదు ఈ
వలపుమహత్త్వ మెట్టిదియొ - బాపురె? ఎట్టి విరాగి నేనియున్
తలసిగబట్టి యూపుచు ని - తంబిని పాదసరోరుహంబులన్
మిలఁగ సరాఁగు జేయు పర - మేష్ఠినిసైతము మోసపుచ్చదే?

(మదను నుద్దేశించి) మన్మథా! నీ విలువిద్యా నైపుణ్య మెంత బ్రశంస
నీయము. ఆహా! ఏమి నీ బాణప్రయోగ మందలి వైచిత్ర్యము!

గీ అరయ నెందరో - బాణవిద్యావిశార
దులు నొకటి రెండుజేతురు - దోర్బలమున
నీవో! రెండు నొకటిగ జే - నేర్తువార
మార నీదగుశక్తి య - మానుషంబు.

(స్మృతినభినయించి) ఏది యెట్లైనను నే నీతనియెడ నొరులకంట బడకుండ
సత్వరముగ్గ నేహమ్మున కరుగుటయే యుత్తమము. లేనియెడ
ఘోరలోకాపవాదమునకు బాల్పడవలసి వచ్చును. (అని వెడలు
చు కొంతదూరమున సుందరకుని జూచి తెల్లబోయి నిలువంబడి)
ఓహోహో! యీ బుద్ధస్వరూపం బీయెడ సాక్షాత్కరించిన దే!
ఈతనికంట బడకుండు టెట్లు! (అని కొంచెము చాటుగా నక్కి
యుండును)

సుం—(చేరుమాల బరికించుచు) ఈవిలాసవస్త్ర శకలం బేరిదై యుండ
నోపు. (అందలి నామము గాంచి, పుష్పహాసుకు అని చదివి) ఈ
నామాక్షరంబు లేరి వైయుండును!

పుష్ప—(స్వ) నే నిందుండి వెడలునప్పు డిది యిందు బడియుండనోపు. ఔరా! ఎంతమోసము! దీన బయటబడి యథార్థం బించుకేనియు వాక్రువ్వక తప్పునట్లు తోచదు.

సుం—(ఆ రెండక్షరములగుణించుచు) పు...హా...పు...ష్ప...హా ఔరా! పుష్పహాసుండుగా?...

పుష్ప—(తనలో) ఇదే సమయము. (ప్రకా) మిత్రమా! ఇదే వచ్చితిని.

సుం—(తెల్లబోయి కోపముతో) దుర్మతీ! ని న్నెవ్వ రిందు బిలచిరి? నీ విందు రాకారణం బేమి? నీవిలాసవస్త్రశకలం బిందుండ హేతు వేమి?

పుష్ప—వయస్యా! సుందరకా! ఆగ్రహింపకుము. ఏను భవజ్జనకునికై కంకణం బొండు కానుకగా గైకొని యీయెడ కేతేర, మీదాసి కాగణంబులో నొకరుక, యేలిక లేడనియు, రాకొమరిత కొసం గెదననియు నిర్బంధించి యక్కటకంబు గైకొని వెడలె.

సుం—(ఆగ్రహావేశుడై)

మ. అరరే! హీనకులాధమా ఖల మదాం - ధా! కాన్కలన్ బంపెదే
తరుణీరత్నము లుండుచోటునకు? నీ - తా తెవ్వడడ్డంబు నే
నరుకన్ జూచిన? నిప్డు నీతనువు నా - నాఖండఖండంబులన్
సరి చేజిక్కితి విం కె టేగెదవు నీ - చా! దుష్ట! ముష్టింపచా!

(మీది కురుకును)

పుష్ప—(సవిలాసముగ పట్టుకొని చిరునవ్వుతో) ఓహో! ఏమియీ ప్రతాపము. అమ్మపుట్టింటి యౌన్నత్యంబు మేనమామ యొను టనా ప్రశంసించుట. దుర్మతీ! సంగడీడవని ప్రసంగించి నందు లకా యీ యసందర్భ ప్రలాపములు. నీబోటి పరమమూర్ఖాగ్రేసరావతంసములు సామవచనంబులన్ జక్కబడుదురా? (కోపముతో)

గీ. కౌరవబలాబ్ధి గలచిన - గదను మించి
అవనిధరముల జెండిన - యశని మించి
డంబుమీరిన కాలదం - డంబు మించి
దుష్ట పటలి తెంచె నీకునై - ముష్టి యిదుగో

(గుద్ది యురుకును)

సుం—హా, హా... (మూర్ఛిల్లును)

(యవనిక జారును.)

ఇది ద్వితీయాంకము



# పుష్పహాస

## తృతీయాంకము

ఉద్యానవనము. సాయంసమయము.

(తిలక కరంబు కేలన్ బూని లలిత ప్రవేశించును)

లలి—చెలీ! తిలకా! నేడీ యుద్యానవనం బెంత రమణీయముగా గన్పట్టుచున్నదో కనుంగొనుము. ఆ వికసితసుమవితానంబు లానందజనకంబులై పరిమళంబు లెట్లు వెదజల్లుచున్నవో పరికింపుము.

మ. అవియే మంజులమాలతీకుసుమముల్ - ఆ కేవ గన్పట్టు న
య్యవియే చంపకమాధవీవకుళమా - ల్యంబుల్ జపాపుష్పముల్
ఇవియే ఫుల్లసరోజపుంజము లివే - యిందీవరాస్ఫోట లీ
దవులన్ గానగవచ్చునియ్యవియె మం- దారంబు లిందే చెలీ!

తిల—సఖీ! ఇట్టి ప్రసూనంబుల కేమిగాని, అందలి వృత్తాంత మెద్ది?

లలి—లజ్జాకరము

తిల—రహస్యంబు గాదుగదా!

లలి—కాకుండు టెట్లు? ఆ రెండును పరస్పరమైత్రియుతంబులే గదా!

తిల—అయిన నీయభాగ్య చేటిక వినదగని పరమరహస్యమా?

లలి—నెచ్చెలీ! అటు లంటివి గాని నారహస్యవస్తువును భద్రపరుప నీ హృదయపేటిక లోహనిర్మితం బని యే నెరుంగనా? కాని వ్రీడాభరంబుచే నాస్వప్నవిషయంబు వెలిబుచ్చ వెనుదీయుచుంటి.

తిల—(స్వ) మరల కంకణధారణ కారణుండు కలను కన్పట్టెగాబోలు. (నవ్వుచు ప్రకా)సఖీ! భవత్స్వప్నసాక్షాత్కృత సుందరుండు ఆతండు కాడుగదా!

లలి—(మందహాసముతో తల వంచును)

తిల—(స్వ) ఏల కాకుండును? తా నొక దేవత నుపాసించ, మరొండు దేవత తనకు ప్రత్యక్ష మగునా? (ప్ర) ఆ. అంత వాతండు గనంబడి...

లలి—(సిగ్గుచే) అబ్బా! (కొంతవడి యూరకుండి) మదీయ పర్యంక భాగమును జేరి...

తిల—ఆ. పదంపడి

లలి—

సీ. కామినీ! తపియింతు - గైకొందు నేయని
మోము మోమున జేర్చు - ముద్దు గొనగ
భామినీ! చనగవ - భారంబు దీర్తని
పాలిండ్లపయ్యెద - బయలుపరచు
మానినీ! యధరంబు - మధురాలయం బని
జిలిబిలినవ్వులన్ - జిలుక బలుకు
మోహినీ! నాపయి - మోహ మున్నదె? యంచు
క్రీగంటి చూడ్కులన్ - గీలు కొలుపు

గీ. చాన! ఏను కులీనుండ - గా నటంచు
నెంచి నిరసించెదో? వరి-యించి ప్రేమ
వెల్లి ముంచెదో? ప్రేయసీ - వేగ దెలుపు
మంచు మరునకు న న్నప్పు - గించి చనియె

తిల—(నవ్వుచు స్వ) ఆ మదనమోహనమూర్తిని తదేకనిష్ఠాగరిష్ఠయై సతతంబు జపించుచుంటచే నిట్టివె పరీత్యంబునకు లోనయ్యె!

(ప్ర) సఖీ! ఎంతటిభాగ్య శాలినివే! అంతటి రారాజును వరించ నీ కిక కొరంత యేమి?

లలి—చెలీ! పరిహాసముల కేమిగాని, ప్రబలసంశయం బొందు మన్మనో వీథి బ్రబలుచుండె నే?

తిల—చందనగంధి బిరుదముల్ వదలి మత్స్యగంధి నామమ్ముగా బడ యు టెట్టు లనియా?

లలి—చెలీ! సల్లాపముల కిది సమయమా?

తిల—నీతరుణం బిక ముందై నను నా యద నిది యని నీ వెరుంగనిదియా? సఖీ! ఆసంశయం బేమి?

లలి—

ఉ. జాలరియైనచో గనగ - జాలునె మంజులదేహదీప్తి శం
పాలతవోలె? శ్రావ్యపుర-వంబు గళంబున కబ్బునే రసా
వాలమువోలె? శౌర్యవిభ - వంబును ధైర్యపరాక్రమంబు భూ
పాలకమాళికిగా వలెను - వర్తిలునే? చెలి! యాత డల్పుడే?

అంతటి నీచకులమునం దింతటి జగదేకమోహాను డుద్భవించునా? ఒక వేళ నింతటి సౌందర్యాను లేజాతీయునకైనను సంక్రమించు ననుకొంద మనుకొన్నను ఆ మహారాజలక్షణము లెందు మరుగు పుచ్చనగును?

గీ. బంధురానందమును బొంద - బంధుసమితి
సర్వభూభాగ మేలగా - జాలునతడు
లలితమణిసంస్థగితసువ - ర్ణమకుటార్హ
మస్తకుడు నిస్తులాంగుడు - బెస్త యగునె?

అత డొక ప్రచ్ఛన్నకులీనుడే గానియెడల ఈనాపవిత్ర హృదయసా మ్రాజ్యపట్టభద్రు డగునా? నా ప్రేమవాహిని యాతనిపై బ్రవ హించునా?... లేక నే నా జగన్మోహనాకారమునకు ముగ్ధనై

అతనికి లేని క్షత్రియజాతి నారోపించుచుంటినా? కాదు. కాదు. సర్వలక్షణలక్షిత విశాల వక్షస్కుడగు ఆ నాప్రేమైకనిధానము సుక్షత్రియాన్వయుం డనుటకు సందేహ మేల?

తిల—చెలీ! నీయూహ యన్యథా ప్రవర్తించునా? నిశ్చయము. నిశ్చయము.

లలి—(సిగ్గుచే) ఎటుల?

తిల—రాత్రి మనము పరున్న పిదప నే నొక ప్రచ్ఛన్నపురుషవేషధారిణినై ఆబెస్తపల్లె కరగి యం దాతని గృహసమీప వేదికపై గూర్చుండి యేతద్విషయ మాలోచించుచుంటి. అంత నా కుటీరాంతర్భాగంబున నాతని తలిదండ్రులగు ముదుసలు లిరువురు రహస్యముగ సంభాషించు కొనుచుండ కొన్ని విషయములుమాత్ర మెట్టకేలకు గ్రహింపగల్గితిని.

లలి—(ఆతురతతో) ఏమని?

తిల—తమ కుమారుండు కంకణము రాజాంతఃపురమునకు గొంపోవుట కేవల మపాయకర మనియు, తమకుమారుని క్షత్రియాకార లక్షణము లన్నియు నంతిపురాంగనలు గాంచిన మహాపదవ మనియు, నింతకాలము నుండియు కుమారునివలె పోషించు కొనుచున్న రాకొమరుం డటులైన తమకు దక్కడనియు

లలి—(సంతోషాతిరేకమున) చెలీ! నీయుపకృతి కాజన్మాంతము నిన్ను మరువజాలనే?. (కౌగిలించుకొనును)

తిల—ఇప్పు డిట్టులే యందువు. ఆముద్దుల మగనితో మురిపెములు బలుకుచు ముందర గులుకుచుండు నీ కప్పట్టున నేను జ్ఞప్తికి వచ్చుటయు గూడనా?

లలి—సఖీ! ఆస్వప్నగత శృంగార చేష్టితంబుల ఆమృదుమధురవిలాస వచనంబుల నెంతటి పాషాణహృదయంబైనను ద్రవీభూతంబు

గాక యుండునే? చెలీ! అనర్మగర్భ సంభాషణం బనుస్మరణీయం బగదా!

మ. తల యేచ్చవించిన కైశికాభజనిత - ధ్వాంతంబునన్ మంతువే?
చెలియా! యంచని శీర్ష మెత్తి - భళిరా! స్మేర ప్రభాకౌముదిన్
దోలగన్ ద్రోచి తమిస్రము న్నిడుదె? - సంతోషం బనంగుండు నిన్
చెలువా బూవులవాన ముంచుతని యా-శీర్వాదముల్ సల్పెడున్.

శా. కాంతా! వ్యాళసమన్వితాద్రులకు పై - గా పుష్కరం బుండ నీ
వెంతో వింతగ క్రిందు జేసియును వ-ర్వేందున్ బయి న్నిల్పితౌ
స్వాంతంబందున సంభ్రమం బొదవు నీ - చాతుర్యపున్ జెయ్దమో
యింతీ! యంచు కవుంగిలించి బయిపై - నెంతేనియున్ మించెదన్

తిల—సఖీ! నీయీ పురాణపఠనమునకు ఫలశ్రుతి యిందిరానందనుని బోలు ఆసుందరాంగుని పరిణయంబాడి యమందానందకందళిత హృదయారవింద నగుదునని యేనా? చెలీ! అందులకు భవన్మాతా పితరు లంగీకరింతురా? సోదరుం డాదరించునా? నిన్నుబోలు కన్నమిన్నలు సన్నుతింతురా? ఇంత యేల? నీ కనురూపుడగు వేరొక రాకుమారుని వరింపుము.

లలి—(కోపముతో) ఆఁ. ఆఁ. పరమపతివ్రతామతల్లుల కాటపట్టగు భారత దేశమునందు జన్మించిన హైందవాంగన తుచ్ఛశారీర సుఖంబుల కాస జెందు పాశ్చాత్య వనితవోలె మాటి కొకని ప్రేమించునని తలంచు మంటివా? పవిత్రధర్మబద్ధ యగు హిందూ వనిత లట్టి స్వేచ్ఛావృత్తులకు బాల్పడరని తలంచుము........ స్వచ్ఛమై, పవిత్రమై పొంగుచుండు వారి ప్రేమవాహిని కుటిల మార్గగామి యగునని యేనాటికేని తలంపకుము. సతీమతల్లులగు సావిత్రి, దమయంతీ పవిత్ర చరిత్రలు నీ కర్ణకుహరములందు ప్రతిధ్వనుల గొల్పుచుండ లేదా! నెచ్చెలీ! నా నిశ్చితాభిప్రాయము వినుము.

సీ. అల్లారు ముద్దుగా - నతివరో! నను బెంచు
జనకుండె యిలు వీడి - చను మటన్న
కంటికి రెప్పయా - కరణి న న్బోషించు
తల్లి పోర్వెట్టియు - తగ దటన్న
కోరు వస్తువు లెల్ల - గూర్చి ప్రేమించెడు
సోదరుం డనుమతి - జూపకున్న
సాటిబోటులు నాట - పాటల రానీక
బాయుచు మదిలోన - రోయుచున్న

గీ. సకల సద్గుణ పుంజ వి - స్తారభాసు
డవిరళానందచంద్రికా - ధవళహాసు
పుష్పహాసుని గాక నే - పురుషునైన
ఎంచ తిలకించ వరియించి - మించ చెలియ!

తిల—చెలీ! భూపుం డాత డెక్కడ, చేపల మూపునం బెట్టి చేపలోయని కేక వేయు నే నెక్కడ నని భవజ్జనకునకై వెరచి నీ నెయ్యుండే యందుల కియ్యకొననిచో నుయ్యేడక నేరితో కయ్య మొనర్తువే?

లలి—సఖీ! ఎంతగోలవే! ఆ విధిగా విధి విధించినచో;

మ. ప్రళయోగ్రానల కీలలన్ దుముకుటో - పాథోధులన్ గూలుటో
కలకాలం బవివాహితావ్రతము సంక - ల్పించుటో ఖడ్గధా
రల శీర్షంబును ద్రెంచుటో విషము లీ-లన్ గ్రోలుటో యింకెటో
చెలియా! యే ముడి వేసుకొంటి నపుడే - చేలాంచలంబాదునన్.

తిల—(స్వ) ఔరా! ఏమి యీమె మనోనిశ్చలత? అబ్బా! యీమె యనివార్యానురాగాన్వితయై కనంబడుచున్నయదే! ఇక నిందుం డుట సమంజసంబుగాదు ప్రొద్దుగుంకు సమయం బాసన్నమైనది. (ప్ర) నెచ్చెలీ!

సీ. కలరవంబులతోడ - ఖగజాతములు గూడి
బారుగా గూళ్ళకై - పారు నవిగొ
సంధ్యాదివిధులకై - స్నానంబు గావింప
పశ్చిమాంబుధి జేరు - భాను డదుగొ
కేలు కేలున బూన్చి - కేరడంబులతోడ
వాహ్యాళి కేగు యా-వను లరుంగో
ప్రియుపోకకై బిట్టు - విలపించి విలపించి
ముకుళించు పద్మముల్ - ముగుద! యివిగొ

గీ. సంజ కెంజాయ లవిగొ ది-క్చయములందు
దండు వెడలెను తండోప - తండములుగ
వేచియుందురు మనలకై - వెలది లచట
నిలయముల జేర రమ్మంచు - మెలగ జనదు.

లలి—సఖీ! ఆ దిశం గాంచుము.

మ. తనకాంతుం బెడబాసి రాకకయి సం - తాపంబు రెట్టింపగా
కను లింతేనియు మార్చక న్నిగుల ప - క్షద్వంద్వ మల్లార్చుచున్
కొనకాళ్ళన్ దిలకించుచున్ - దిశల నాల్గున్ వృక్షశాఖానికే
తన భాగంబున నల్లదే కను శకు-న్తం బొంటు గాన్పించెడున్.

అబ్బా! ఆ యండజం బెంత తీవ్రతర వేదనం దగులువడినదో కనుం గొనుము.

తిల—చెలీ! పరస్పర ప్రేమపాశబద్ధులగు మానవులే యొకరి నొకరు దైవ యోగంబుచే చిరకాలంబు బాయుచుండ నీ విహంగ వియోగం బొక లెక్కయా?

లలి—అబ్బా! అట్టి దుర్భరావేగ వియోగాయత్తచిత్తు లెంతటి దుర దృష్టవంతులో కదే?

ఉ. వంతకు లోనుగారు బల-వంతపు కష్టము వచ్చెనేని కా
సంతయు కుందబోరు హృద-యమ్మున బంధుల బాసిరేనియుఁ
చింతిలబోరు కూటికి కృ-శించు దరిద్రత కెన్నడేని, యిం
తింతలు వ్రయ్యగా హృదయ మింతులు కాంతువియోగ మోర్తురే!
తిల—చెలీ! నిన్న మనము లతా గృహంబున కేగమైతిమి. నేడైనను
కొంచె మందు విశ్రమింతము రమ్ము.
(అంత నిరువురు కొంతదూరముననున్న లతాగృహంబున కేగి
యందు కూర్చుందురు)
లలి—సఖీ! విశాలచంద్రశాలా వాసమునకన్న నీ దృశలతాలయావా
సమే యింపు సుమా? (అనిదిగ్గనలేచి) చెలీ! చెలీ! ఆ తీవెయం
దాపత్రిక నెవరంటగట్టిరి? (అందేగి కాగితంబు గైకొని లేఖఁ
జదువకయే క్రిందనున్న నామముఁ గాంచి లేఖ తిలకవయిఁ
వైచి చిరు నవ్వుతో తల వంచును)
తిల—(గ్రహించి లోలోననవ్వుచు(స్వగ) ఓహో! ప్రణయలేఖగాబోలు!
(ప్ర) సఖీ! ఏమది?
లలి—తిలకించిన తెలియగలదు.
తిల—ఈవు పాంగముగా గాంచితివికదా?
లలి—లేదు.
తిల—కారణము?
లలి—(సిగ్గు నభినయించును)
తిల—అబ్బా ఎంతసిగ్గరివే! పఠింపనేగాని వినుటకు లేదుగాబోలు లజ్జ?
(లేఖ నందుకొని) సరే సావధానవై వినుము (చదువును)
"మ. లలనా! ఏ గగనోచ్చసైతి నిక వా-లాయుంబు భాస్వత్కళా
కలిత. బా భవదీయదివ్యలలితా-కారంబు; దేశాంతరం
బులకుఁ బోవుచునుంటి ప్రాణము లెటో - బొందిఁ బిగఁబట్టుచుఁ
లలితా! నీస్మరణఁ విదేశమున లీ-లఁ కాలముఁ బుచ్చెదఁ.

**లలి**—(శోక, భయ, సంభ్రమంబులు ముప్పిరిగొన)

ఆ, ఆ... దేశాంతరంబుల ... దేశాంతరంబుల కేగుచుంటివా? ...యేగుచుంటివా? మన్మనో...రత్నాపహారుండవై యరుగుచుంటివా?...అరుగుచుంటివా? "ఈవేళప్పు నితఃపర బెరుంగనని తదేకనిష్ఠనై భవదీయమూర్తినే సతంబుధ్యానించు ఈ నీ చరణదాసిని... ఈ నీ... చరణ... దాసిని... అపారదుఃఖ పారావార తరంగంబులం బడఁ ద్రోసెదవా? ఆభీలశోకబాడబానలంబునఁ ద్రుగ్గ జేసెదవా? అనంత సంతాపాటవి నలయింతువా? అలయింతువా? హా నాథా!... నాథా... ప్రాణనాథా! హా హా

(మూర్ఛిల్లును)

**శిల**—(చేలాంచలమున విసరుచుండును)

**లలి**—(వెంటనే తెలివిగని) హా! మనోహరా! (దుఃఖముతో)

చం. తలచితిగాని సద్గుణని-ధానసుధీ! భవదీయ పత్నినై
మెలగ సతంబు భావజస - మీకమునన్నలయింతు వంచు లో
దలచితిగాని: నీభుజల - తల్ పెనవైచియు నొంతు వంచు నే
తలప వియోగసంజనిత - తాపమహోదధి గూల్తు వం చెదఁన్.

హా సఖీ! ప్రణయలేఖయని యువ్విళ్ళూర నెంతలో ప్రళయరేఖగా మారినయదే. హా దైవమా! "యింతింతలు ప్రయ్యగా హృదయ మింతులు కాంతువియోగ మోర్తురే?" యని వాకొనుచుండగనే, అట్టిదుర్భర సంఘటనం బీ యభాగ్యురాలికే ఘటింప జేసితివా? హా చెలీ! 'విహంగవియోగం బొక లెక్కయా? పరస్పరప్రేమ పాశబద్ధులగు మానవులే యొకరి నొకరు దైవయోగంబుచే బాయుచుండ'నను నీవచనంబు లన్నియు మరుక్షణంబుననే యీదుఃఖభాగిని యెడ ప్రత్యక్షమయ్యెంగదే? హా నెచ్చెలీ! ఆమదనవిదళితాకారుం డదయుండగుట కే నొనర్చిన తప్పిదం బెద్దియో గదే?

తిల—సఖీ! మఱచితిని. నిన్న నా కొకవార్త తెలియవచ్చె.

లలి—(ఆతురతతో) ఎట్టివార్త?

తిల— యువరాజుగారగు సుందరకుని పుష్పహాసుఁడు భర్తృదారికా సౌధసమీప ప్రాంతమున గ్రుద్ది పారిపోయెననియు, మంత్రు లాతని కారాగారబద్ధునిజేయ బట్టితెచ్చుటకు భటులనంపిరనియు నాత డింకను పట్టుబడలేదనియు, రెండుమూఁడు దినములనుండి మన పట్టణం బంతయు మారుమ్రోగుచుండెనట.

లలి—హా చెలీ! యిక నేమున్నది. (దుఃఖాక్రాంతయగును)

తిల—నా జాతం డంతిపురిని వీడి చనునంతలో నీసోదరుని కంటబడి యుండనోపు. పూర్వవైరంబు పురస్కరించుకొని నీ సోదరుం డాతని నిందించ, నంత పుష్పహాసుం డా కృత్యమునకు బాల్పడి యుండునని నే దలంతు.

లలి—హా! మనోహరా! ఎట్టి ఘోరకృత్యం బాచరించితివి? అయ్యో! నా జనకుం డేతెంచి ఈ విషయము వినినచో నిన్ను శిక్షింప కుండునా? ఆ నీ సిలుగులం గాంచి ఈ నీ జీవితేశ్వరి సజీవయై యుండునా?

తిల—అత డన్యదేశములకు వెడలుట కద్దియే కారణంబై యుండనోపు. (లేఖఁ దిలకించి) ఓహో! తన ప్రయాణము సైతము నిందు బొందుపరచెనే! పాపము రేవా నగరమున మాత్రము కొన్ని దివసములు వసించి పిదప నెటకేనియు నేగునట. (లేఖ మరి కొంతవడి బరికించి, నవ్వుచు లలిత కొసంగి యొకచో వేలిడి చూపును. అయ్యెడ గాంచి లలిత యానందముతో తిలకఁ గాంచును) ఏమందువు?

లలి—(చిరునవ్వుతో) భవాదృశ సాహసిక సఖీమణి సాహాయ్యం బుండ సందేహ మేమి?

తిల—"ఆలస్య మమృతం విషం"బను నార్యోక్తి నీ వెఱుంగనిదియా!

లలి—(మందహాసముతో నంగీకారము సూచించును)

తిల—చెలీ! మన మిందు ప్రవేశించి చాల తడవయ్యె. భవజ్జనయిత్రి మనకై వేచియుండు. రమ్ము. (ఇరువురు లేచి వెడలుచు) సఖీ! చంద్రికా ప్రసార సకలదిగంతుండగు శీతమయూఖునిఁ గనుము.

సీ. రజనీ సతీవేణి - రంజిల్లుచుండెడు
కుందప్రసూనంపు - గుచ్ఛ మనఁగ
భువన నాటకరంగ-మున ధాత నిర్మించ
వెలుఁగు ఎలెక్ట్రి - బలు బనంగ
గగన గోపాలుని - కరమునందు రహించు
ముద్దు గుల్కెడు వెన్న - ముద్ద యనఁగ
దేవకాంతలు షోకు - దిలకింప ద్యుఃపీఠ
మున నుంచు వలయంపు - ముకుర మనఁగ

గీ. ధవళశీతల కాంతి వి-స్తారవిగత
తతతమస్కుఁడు కుముద బాం-ధవుఁడు విరహ
బాడబానల జృంభ-ప్రభంజనుండు
అదుగో! సోముండు విలసిల్లు - నంబరమున.

(నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.



ఓం.

శ్రీ సీతారామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# పుష్పహాస



## చతుర్థాంకము

### ప్రథమ రంగము

(రేవానగర ప్రాంతము. ప్రవేశము పుష్పహాసుఁడు)

పుష్ప—

ఉ. హా జలజాక్షి! హా కిసల-యాధర! హా మృగరాజమధ్యమా!
హా జగదేకమోహనల-తాంగి! మనోహరనూత్నయౌవన
భ్రాజితగాత్రి! హా సమద-బంభరవేణి! సరోజపాణి! హా
హా! జితకీరవాణి కరు - ణామృతసారణి చిత్తహారిణీ!

హా మనోహరి! లలితా! ఆ నీ శిరీషకుసుమపేశలగాత్ర సందర్శనభాగ్య మీ యభాగ్యునకీ జన్మమున లభించునే? హా లతికాలలితదేహా! లలితా! పరభృతాలాపంబులఁ బరిహసించు ఆ నీ జిలిబిలి పలుకు లాలించి పంచశరసామ్రాజ్యాభిషేకంబునఁ బ్రహ్మానందంబు జెంది బ్రతుకఁదలంతునే? హా రోలంబకదంబలంబకబరీ! లలితా! అనంగ లీలాతరంగిత మతివై యాలింగనసుఖంబొసంగ నాత్మానందానుసంధాయినివై "హా" యని పారవశ్యంబు నొంద నభిలషించుచుంటినే? హా ముకురసన్నిభముఖీ! లలితా! ప్రణయకలహంబులఁ బరితపింప "ప్రాణప్రియా" యని బాహుమృణాలంబులఁ మెడఁ బడవైచి యపాంగావలోకనంబున నన్నాదరింతువంచెంచి

తినే! హా మరాళ మందగమనా! లలితా! ఇంత యేల నీ నిర్హే
తుకజాయమానకటాక్షవీక్షణంబుల న్నిరంతరంబు పరాధికస్థ
సౌఖ్యంబుచే పరిఢవిల్లు నవరసికశిఖావతంసుం డీతడేయని తన్మ
యుండనైతినే! హా జగదేక మోహినీ! లలితా! అయ్యో! ఎం
తలో నెంతటి వైపరీత్యంబు సంభవించె.

సీ. "తరుణిరో! రాకాసు-ధాకరు హసియించు
కమనీయవదనంబు - గాంచి, గాంచి
కలికిరో! జక్కవ - కవ బోలు చన్గవ
నలమోదమున బట్టి - యలమి యలమి
మగువరో! పీయూష - మధురంబు నిరసించు
నధరంపు పానక - మాని యాని
చెలియరో! తళుకు లే - జెక్కుల పుణుకుచు
నతిమోదమున ముద్దు - లాడి యాడి

గీ. అంగనా! సందిళుల బట్టి - యదిమి యదిమి
సురతవగల దేల నిరతంబు - మురియుచుండ
సుందరాంగిరో! నాదగు - డెంద మగుల
బాల! యీవేళ నిను బాయ - వలసె నకట.

హా సుందరీమణీ! ఆ నీ పూర్ణిమేందు మందిరంబగు మందస్మిత సుందర
వదనారవిందము నేత్రానందముగ గనంబరచుము... నేత్రానం
దముగ గనంబరచుము. ఆ నీ సుకుమార గాత్రస్పర్శన సుఖంబు
మరొక్కసారి యొసంగుము. మరొక్కసారి యొసంగుము. హా
కోమలీ! కంకణధారణ విషచే కరం బిడి కీలుకొలుపు వాలు
జూపు లింకొక్కసారి ప్రసాదింపుము. ఇంకొక్కసారి ప్రసాదిం
పుము... అయ్యో! ఇంకెక్కడిచూపులు, ఇంకెక్కడిచూపులు. హా
లలితా! అయ్యో! నాయాశాపరంపర యాకాశహర్మ్యమయ్యె

నా? హా జగన్మోహినీ! లలితా! నీ సోదరునియం దేనోనర్చిన తప్పిదంబునకై భవజ్జనకుడు శిక్షించునను భయంబుచే వెఱ్ఱినై పారుచుంటినిగాని, నీదివ్యమంగళ విగ్రహంబుం డాసి.

ఉ. హా కమలాయతాక్షిరో! ము-దావహహాసా భవదీయ కోమల
శ్రీ కమనీయపాదసర-సీరుహయుగ్మమె దిక్కటన్న న
స్తోకకృపాతిరేకమున - సుందరి! నాతెఱ గ్రోలనిచ్చియు
న్నీకుచకుంభమధ్యమున - నిద్దుర బుచ్చవె ముద్దుగుమ్మరో.

హా మధురమంజులభాషిణీ! లలితా!

సీ. విరజాజిసరులు నీ - కుఱులను దురిమెడు
కొరవాయి దీరదే - కోమలాంగి
కరపల్లవంబును - గై సేసి విహరించు
కొరతయు దీరదే - కులుకులాడి
బుగ్గల నులిమియు - బుజ్జగించెడునట్టి
అఱ యింత దీరదే - సరసిజాక్షి
విడె మొసంగుచు నీవి - సడలించి పైకొను
తరుగును దీరదే - తలిరుబోడి

గీ. ఇట్టికోరిక లెల్ల నిం-కెట్లు దీరు
పోవుచున్నాడ నీదగు - పొత్తు వీడి
పెన్నిధిని బాసి చనియెడు - పేదపగిది
వికచసంపూర్ణశతపత్ర - విమలనేత్ర!

(ఉలికిపడి) ఔరా! రాజభటు లెందరో క్రమ్ముకొని నాకై త్రిమ్మరుచున్నను నెమ్మనంబునం దించుకేని భయమ్మందనైతిసే! వారి బారి బడక తత్క్షణంబు తలఁ దాచుకొను దారి నారయవలయు.

(ఒకవైపవలోకించి)

మ. అదె రేవానగరంబు మేడ లవియే - యారామసంఘం బదే
అదే దేవాలయగోపురం, బదె బలి - ష్ఠాకారమౌ కోట, యు
ల్లదియే నిర్ఝరిణీప్రవాహము నమర్త్యౌ-ఘంబునుం గూడు నా
త్రిదివం బీపుటభేదనం బనగ దే - దీప్యంబునై వెల్గెడున్

(నిష్క్రమించును)

---

ద్వితీయ రంగము - అరణ్యప్రదేశము

(లలిత ప్రవేశము)

లలి—(దుఃఖముతో) హా సఖీ! హా తిలకా! నన్ను బాసి పోయితివా? అయ్యో, నాదప్పిదీరుట కిక ముందెందైన నీరంబు లేకయుండు నా? నన్ను వదలి యీభయంకరకాంతారసీమ నీవొంటిగా జన నేల? హా చెలీ! వెంటనే పానీయముల దెత్తునని మరల నాకం టికేనియు గాన్పించవైతివే? అయ్యో? ఇమ్మహాటవియందు దారి దప్పి యెం దేగితివో గదా? నీజాడ యెందు గాన్పించు? అబ్బా! దుర్గమంబగు నీ ప్రదేశంబుల నింకెంతని వెతుకగలను? హా, నచ్చెలీ! ఇక నా కేది దిక్కు? హా ప్రాణసఖీ!

మ. అరయన్ చిన్నతనంబునుండియుచు - దాస్యం బెంతయో సల్పి నా
సరసన్ జేరి భుజింపుచున్ మృదులభా-షాచాతురిన్ చేతముల్
గరగన్ జేయుచు ప్రక్క బండి సతమున్ - కట్టా! ననున్ వీడితే!
శరభవ్యాఘ్రమదేభసింహ వృకసం - చారంబునౌ కోనలోన్.

అయ్యో! నానావిధ ఘోరసత్వంబుల కాకరంబయి, చోరవీర నాయ కుల కాటపట్టయి; బీభత్సనిలయంబగు యీనిర్మానుష్య భయం కరాటవిని దరించు టెట్లులో గదా! హా దైవమా!

సీ. ప్రళయకాలాంబుద - వరా గర్జన మన
భయదధ్వనుల గొల్పు - వన్యములును
విపులవక్త్రాంతర - విషబిందువుల్ చింద
ఫూత్కార మొనరించు - భుజగములును
వల్లీపలాశ సం - వలితమై మార్గంబు
గప్పెడుగుల్మనికా-యములును
చెవిదోయి కెల్లెడ చిల్లులువడ నెప్డు
గీ యని వాపోవు - కీచురాలు
గీ. సాలహింతాలవంజుల - సాలభూజ
జాలములు గల్గి యాభీల-లీల దనరు
కాననాంతరసీమ - నేకాకి నయ్యు
జిక్కి తపియింప జేసితే - దిక్కులేక.

ఔరా! యీ నా సాహసకృత్యంబు తలంచుకొనిన యొడలు జలదరించు చున్నయదే? అబలనని యాలోచింపక, యకార్యమని యెంచక, నపాయంబని తలంచక, నేరైన గాంచుచో నవమానమనియు దల కక, మానహానియే యని యనుమానింపక, ముందెట్టి విపత్పరం పర కెరయాదునోయని ముహూర్తమాత్రమేనియు విమర్శిం పక, అయ్యో! సాహసికనై ఎట్టి కష్టంబులు చేజేత తెచ్చిపెట్టు కుంటి. హా! పరాత్పరా! ఆగర్భ శ్రీమంతురాలనే, అబలనే, అరణ్య భాగమున నల్లాడుచుంటినే, అయ్యో! నా మొరాలింప వా? ఆర్తత్రాణ పరాయణుండవే? చరాచరప్రపంచం బంతయు సాకు నీ కీ దిక్కులేని పక్షియొక్కటే ఎక్కసంబాయెనా? దీన జన బంధుండవగు నీ కీ దీనురా లొనర్చిన దోసమేమి?

గీ. చనదొ నాదీనపుం మొర - శ్రవణయుగళి
పతిత నని యెంచి నిరసన - భావ మొక్కొ?
మరపు దట్టెనొ లేక డం-బంబుకొరకొ?
పతిత పావన బిరుదం బు - పరమపురుష!

ఏమేమీ! హీనజాతు నొకని జేర నేగఁచుండెనను దోసమాపాదించి యుపేక్షాభావమూనితివా? హా! ఆర్తావనా! నా నాథుఁడు, నా హృదయాధి నాథుఁడు, హీన కులునివోలె గన్పట్టుచుండెనా? ఆ పద్మపత్రి విశాల నేత్రములు, ఆ వెడదయురము, ఆ ఆజాను బాహువులు, ఆ మనోహర మందహాస సుందర వదనారవిందం బులన్ బట్టి యాతఁడొక ప్రచ్ఛన్నకులీనుండని సందేహించుచుండ మద్దాసీ ముఖంబున నాతనియాభిజాత్యంబు నాకు గూడ నభి వ్యక్తంబయ్యెంగదా? సకలజగదంతర్యామివగు నీకు, సర్వజ్ఞుండ వగు నీకు, తెలియకుండునా? తండ్రీ! కరుణింపుము. (భయా క్రాంతయై) అయ్యో! యీ విపినమా, అపారమై కన్పట్టుచున్న యది. దారియూ తారుమారయ్యె. వారువంబా డస్సిపోయె హా! యిక నాకేది దిక్కు. (దుఃఖముతో)

సీ. నరులార యక్షకి-న్నరులార సురలార
దయజూడరే జటా-ధారులార
హరులార నిర్జిత-హరులార, పులులార
కావరే ఖడ్గమృ-గములార
కరులార శీతోష్ణ-కరులార గిరులార
నను బ్రోవరే నదీ-నదములార
తరులార హిత సహా-యా-దరులార ఖరులార
ప్రేమ బూనరె వీర - భిల్లులార

గీ. సాకరే సర్వమంగళా-శర్వులార
దారిజూపరె మా పరం-ధాములార!
కృపవహించరె శారదా - ద్రుహిణులార!
చేరిరక్షింపరారె యో - సిద్ధులార.

ఈనా అరణ్యరోదనం బాలించువారెవ్వరు? అతిభయంకరంబగు నీ నిర్జన ప్రదేశంబున నబలనగు నన్నుద్ధరించు వారెవ్వరు? హా

సర్వేశ్వరా! (కూలబడి దుఃఖించుచుండును)

(అంత చేత నొకమూట బట్టుకొని నారిగాడు, యీరిగాడు అను నిరువురు దొంగలు ప్రవేశింతురు)

నారి—ఓరీరిగా! అబ్బ ఇయ్యాల మనద్దుట్ట మంటే అద్దుట్టం గాదురా

యీరి—అదిగాదశా. మన శత్తెమ్మోరు కటాచ్చముంటే సాలుగాని (మూటజూపుచు) ఇట్టాటిలాట్టు లచ్చతొంబయి రమ్మంటే రావంట్రా.

నారి— (రెండుచేతులు పైకెత్తి నమస్కరింపుచు) తల్లి! సల్లనితల్లి నువ్వతాగినంత కల్లొత్తాతల్లి! నాపెల్లాంపిల్లల్ని నన్ను నావాల్లని కట్టాల్లేకుండ కాపాడు తల్లి నీ కాల్లంటి మొక్కతా తల్లి.

యీరి—అబ్బో మనశత్తెమ్మోరంటె సత్తెంగల్లమ్మోరు. సూద్దామన్నా దొరుకుద్దాటరా నాయాల! ఆయాల నువు సూల్లేదంట్రా మా ఆడోల్లకి నాకు కల్లుకాడ యివ్వాదంపడి నన్నింటొకి రానీక నాపెల్లాము తంటాలు పెట్టేతల్కో లబ్బో యిదేందో పలయావచ్చిందే అని అమ్మోరు దగ్గరకెల్లి అట్టె పానాశాగంపడి పాద్దిం చాలకా, నారిగా నీకేమి సెపుదును, మల్లీ నాపెల్లాంగిల్లాంనోరెత్తిందంట్రా.

నారి—అబ్బో! శత్తెంటే శత్తిగాదురా మనశత్తి. బవుసత్తెంగల్ల శెత్తి.

(అంత వెడలుచు కొంతదూరమున నాసీనయై యున్న లలితను గాంచి) వోరరే యీరిగా! అద్దగ్గో ఓఅల్లగ్గో ఆసెట్టుకింద అదేం దోగాని మెరుత్తుందశా! ఆడోరై నా కూకుండారేమొ సూడశా (వ్రేలుతో జూపును)

లలి—(వారలను గాంచి భయవిహ్వలయై) ఔరా! ఆమోటు మానిసులెవ్వరో గదా? ఎవ్వరో యననేల తస్కరేతరు లీ నిర్జనపథంబున నన్ను దుంగిడ నేతురుకే? అయ్యో! ఇక నే నెందు జొత్తు? ఓ దైవమా! ఇక నాకేది దిక్కు?

యారి—(గాంచి) అబ్బ! సిక్కిందిరాపిట్ట. (ఇర్వురు లలితవైపు పర్వె
త్తెదరు)

లలి—అయ్యో! వార లీవంక పరుగిడుచున్నవారలే. హా దయామ
యా! నా కిందెవరు శరణ్యము? హా హతవిధీ! నన్నీచోరుల బారి
బడ ద్రోసెదవా? (పరుగిడ బోవును)

నారి—(అడ్డుకొని) అబ్బో నాసామిరంగ! లగెత్తుందిరోయ్.

యారి—ఆగుపిల్లా, ఆగు! యాడికో దవుడేత్తుందవే.; యాడో డనుకుం
టుండవో, యారిగాడు బవద్దరనుకో. నాదెబ్బంటే యీదారి
మార్గమంతా వడవడాయేటు. కదలివా కాళ్లిరగబొడుత్తా.
వా డీడనుకుంటవేమొ. (కర్రజూపి బెదరించును)

లలి—(కంపితగాత్రయై) అయ్యో! యీమ్రుచ్చులు పెచ్చు పెరుగు
చున్నవారలే. హా ఆపన్నివారకా! ఆర్తావనా! మాంరక్ష మాం
రక్ష.

గీ. అఘటనాఘటనాశక్తి - నఖిలలోక
జీవజాలంబు పోషణ - సేయు నీకు
పాలనము సేయ నీ దీన - బాల యొకతె
భారమయ్యెనె? గోపాల - బాలకృష్ణ!

(దుఃఖముతో) అన్నలారా! దిక్కులేనిదాననై యీయుగ్రాటవిఁ
జిక్కి దుఃఖించుచున్న నిరపరాధిని, నన్నేల నిష్కారణముగ
హింసింపజూతురు. ఇదిగో, యీనాభూషణంబు లన్నియు నొసం
గెద. అన్నలారా! నన్నేల బాధింతురు. అయ్యో! కొట్టకుడు
కొట్టకుడు (భూషణములు తీసి క్రింద వైచుచుండును)

నారి—యారిగా! (రహస్యముగ) అబ్బ! ఏసక్కగుందిర ఈపిల్ల. సూ
త్తుంటే అదేందోగాని నావల్లంతా గాదరేత్తుందశా!

యారి—కాదంట్రామరి. యికసించిన పువ్వుసూత్తే ఏరికైనా యి
నోదమే.

లలి—సోదరులారా! ఇవిగో నా యీ భూషణంబు లన్నియు గైకొని న న్నిక వదలుడు.

నారి— ఇదిగో...బోసానాలకేమిగాని...మరి... ఇదుగో...మరి... ఏమంటావు?

యీారి—(స్వ) అబ్బో? ఈకూ త్రంత యుందు యీామొదవ నారిగాడే అరగిద్దామనుకుంటుందురోవ్ (ప్ర) ఇదుగో పిల్ల! ముందుండాడని నారిగాణ్ణే మోయించేవు, నీ యిష్టమొచ్చినోణ్ణే యేరుకో. సూసుకో. బాగా సూసుకోని కోరుకో. తొందరగిందరలే, వో డందంగుంటే వాడే. నీయిట్టం. పచ్చపాతం సేత్తే పగిలిందేబుఱ్ఱ.

లలి—(దుఃఖముతో) హా! పరాత్పరా! నామేన గల తొడవు లన్నియు నొసంగి ధనాతురులగు నీ దుష్టుల దాటిపోనేర్తునుగదా యని ధైర్యావలంబినినై యుండ, అయ్యో! వీరు కామాతురుల వోలె గనయగడంగుచున్నవారలే. ఇక నామానమును రక్షించు కొనుట యెట్లు? హా మానవతీమాన సంరక్షణా! కృష్ణా! మాం పాహి మాం పాహి.

గీ నాదు కృష్ణా! యిటన్న మా - నంబు గావ
ద్రుపదనందనపై జూపు - కృపను నేడు
కొంచె మీదాసిపై జూప - నెంచుమయ్య
బాల గోపాల! రాధికా - లోల కృష్ణ.

నారి—ఊకో, ఊకో. ఏడపకు. అబ్బనువ్వేడుత్తుంటే నా కేందోగాని యిశారంగుందివూకో ఇదుగో యిందుకా నీయేడుపు? అబ్బో నేం గెయించాలే, మరికెందుకో. అనుకుంటుండా, యిదా. యీానారి గాణ్ణి సేసుకుంటే యేముండింది, సొమ్ములా సొమందాలా! అని యిశారిత్తుండవులే. సూసుకో నాదెబ్బంటే నన్ను సేసుకోమల్లీ; బోసానాలమీాద బోసానాలు వల్లంతా దిగేత్తానో లేదోమరి.

యారి—ఉండశే తెల్లమొగము! యీయారిగాడి కోరమీసం సూత్తే యింకోడసలు యిట్టమయితందంట్రా (లలితతో) రా పిల్లా, రా. ఆట్టు సేత్తివా అంటే పెయోజనంలే. నీయిట్టం. బుజానేసుకొని మోసుకెల్తా.

లలి—(స్వ) అయ్యో! ఇద్దురాత్ముల బారి బాయుదారి యేయుపాయంబునను గానరాకయున్న యదే? అబ్బా నే నొంత యాక్రందించినను ఈ కర్కశ హృదయుల మనంబు గరంగకున్నయదే? (కొంతవడి యాలోచించి ధైర్య మవలంబించి స్వ) కానిమ్ము ఎద్దియేని మిష గల్పించి యిమ్మూష్కరాధముల శుష్క ప్రియోక్తుల నావలకు నిష్క్రమింపజేసెద. (మందహాసము నటించుచు ప్రకా) సరే, అటు లయిన మీలో నెవ్వరు పెండ్లియాడెదరు?

యీ-నా—నేను. నేను. (అని యిద్దరు ముందునకు వత్తురు)

లలి—అటుల గాదు. మీ యిరువురిలో నాకోర్కె దీర్పగల సమర్థుడెవ్వడో వానినే యేను పెండ్లియాడెద.

నారి—నీ సిత్తం నామీదొత్తే సాలుగాని పానాలుగూడ దీసి నీపాదాల కాడ బెట్టే సూరు డీ నారిగాడనుకో. మరోడనుకుండవో?

యీరి—వుండశే. పేనాల దేముంది ఎదవపానాలు. (లలితతో) ఇదిగో పిల్లా. నువ్వు కావాలంటే సాలుగాని, కట్టమైన, నట్టమైన, నీయిట్టమొచ్చిందేందో అది తెచ్చిత్తేనే యీ యీరిగాణ్ణి యివావమాడు.

లలి—ఓ చోర వీరాగ్రగణ్యులారా! అటు లయిన నల్లదే గాంచుడు. ఆ పర్వత శిఖరాగ్రముపై కనుచూపుమేర గనంబడు చెట్టుపైనున్న మనోహర పుష్పములపై నా కెంతయో కోర్కెగలదు. మీ యిరువురిలో నా పుష్పరాజముల ముందుగా నా కెవ్వ డొసంగునో, వానినే ముద్దుల మగనిగ జేకొనియెద.

యారి—ఏంజేంది? ఓ ఆ సెట్టుమీద కానొత్తుండే పుస్పాలు ముండోడు దెచ్చిత్తే వాణ్ణి పెల్లాడుతావు. అహ్హాహ్హా (నవ్వుచు) ఓసీ! యీ ఎదవ పుస్పాలు నా కోక లెక్కా, పత్తరమా? సూడు నా యేటంటే.

నారి—(నవ్వుచు) అబ్బ! మాలావు కట్టపు కోరిక కోరిందిరా నాసామి రంగ. (అంత మూట నట బడవైచి యిరువురు పర్వత శిఖరాధిరోహణంబునకై తత్పృష్ఠభాగంబున కహామహమికతో పరుగిడుదురు)

లలి—(సంతోషముతో మూట గైకొని) ఇం దెవ్వి......ఎవ్వరో యన నేల? చౌర్యగ్రస్తేతరంబు లీ చోరులదండ నుండునే? పాపము. ఎవ్వరో నాబోటి యభాగ్యవ్యక్తి యొండీ పాలసుల పాల బడియె గాబోలు. (అందలి దుస్తులంగాంచి) ఔరా! ఆతని సర్వస్వమును హరించిరే? అయ్యో! పాప మా పురుషుని కట్టు పుట్టముల సైత మీ చెట్టద్వయంబు పొట్ట బెట్టుకుండెనే? ఇక నాలసించిన మరల నాదుష్టు లీయెడ కేగుదెంతురు. అల్లదే నమ్మహీరుహచ్ఛాయను మసలుచున్న నా యశ్వరాజం బధిష్ఠించి పలాయనసూత్ర మవలంబించెద.

(మూట గైకొని తెరలోనికి పర్వెత్తును.)

యవనిక జారును.

ఇది చతుర్థాంకము



ఓం.

అవిఘ్నమస్తు.

శ్రీ సీతారామచంద్రాయ నమః.

# పుష్పహాస



## పంచమాంకము



### ప్రథమరంగము

దేవానగరము

(దేవాలయ ప్రాంగణమునందు పుష్పహాసుడు విచారముఖుడై షూర్చుని యుండగా తెర యెత్తబడును.)

పుష్ప—ఔరా! నే నెంతటి యవివేకిని. భటు లేతెంతురేమో, పట్టుబడ దనేమోయని భయవిహ్వలుండనై మాటిమాటికిని నిటుల పరుగులెత్తుచుంటినిగాని యందుగల ఫలం బావంతయు గ్రహింపజాలనైతి.

ఉ. బంధితు నాదునో యని ది-వంబును రేయును గుందనేల? నా
బంధితుగా నొనర్చి నర - పాలునివీటికి జేర్పబోరె? పు
ష్పంధయవేణిదర్శనవి-పాక మయారె! లభించకున్నె? యే
నంధునివోలె ని ట్లహర-హంబును చింతిలనేల వెర్రినై?

భటులారా! రండు. రండు. నా కేమనోహరమూర్తి పతంసంబు నిరంతర చింతనీయంబగునో, యేరిసుధామధుర నామాక్షరంబులు సదా సంస్మరణీయంబులగునో, అట్టి నాప్రణయ ధనంబయిన యక్కాం

తారత్నంబు పాదారవింద ప్రాంతంబునను జేర్తుమన్న పారిపోదు
నా? రండు, రండు. ఏల యాలసించెదరు? నన్ను గొంపోవుడు,
నన్ను గొంపోవుడు. నాహృదయ సామ్రాజ్యేశ్వరి, నా సుకు
మారబాహువల్లరి, మన్మనోనిలయ విహారిసందర్శన భాగ్యంబు
లభింపజేయుడు. అనివార్యంబగు మదీయతాపంబు వాపుడు.
అయ్యో! మీ రేల వత్తురు? ఈ కురదృష్టవంతున కంతటి యదృ
ష్టంబుగూడనా?

గీ. నిబిడనీరంధ్రతామస నీ- నిశిని గోర
విందు సేయునె కనులకు - నిందుకాంతి?
కష్టకాలంబునందు న-ఖండసుఖము
రమ్ము రమ్మన్న నే రీతి - రాగడంగు.

(లలిత నుద్దేశించి) హా ప్రాణేశ్వరి! అబ్బా! ఈవియోగాంబుధి నెంత
కాలమని యీదుదును. అయ్యో! నీ వెంతటి నిర్దయురాలవు?
ఈయెడ నీప్రియుం డిట్టి యవస్థలను జిక్కి నిద్రాహారముల వర్జిం
చి కృశించుచుండ, నీ వామణీమయ సౌధాంతరాళమున హంస
తూలికా తల్పంబుపై మేను జేర్చి సుఖనిద్ర జెందుచుంటివా?
ఆనంద మనుభవించుచుంటివా? అఖండమై అనుపమానమై
అమూల్యంబగు భవదీయానురాగ ప్రవాహంబు నాపై నప్పటి
కప్పుడే బారజేయునట్లు నాడా లీల నాసగొల్పి బాళిమించి నే
డిట్లు పరిత్యజింప న్యాయమా? హా సఖి! ఆ నీ మధురకళికలను
బోలు పలుకులు ప్రణయజలధి వీచికాడోలికల నూపునని
యెంచితినిగాని యం దింతటి కృత్రిమం బుండుననియు, నీ కోమల
హృదయ మింతటి కాఠిన్యమున కాలవాలమనియు దలంచనైతి.
అందు విచిత్రమేమి? అట్లుండుట నీబోటి కాముకీనివహంబులకు
కడుంగడు నైజంబులుగదా! అందుననే ప్రాజ్ఞులు "మధు తిష్ఠతి
వాచి యోషితాం, హృది హాలాహలమేవ కేవలం" అని యందు

రు॰ నీవు మాత్ర మానూ క్తిని రిత్త జేయనెంతువా? కాదు...
కాదు ...... నా మధురమంజులభాషిణిభావ మట్టిది కాదు.
ప్రియా! నీహృదయము కర్కశముగాదు. నవనీత సమానము.
నీముద్దుపలుకులు విషమిశ్రితములు గావు, ప్రేమపూరితములు.
నీప్రేమ కృత్రిమముగాదు, యథార్థము. యథార్థము......
ప్రాణప్రియా! యీ నీప్రాణనాథు డెప్పుడో యొకప్పుడైన
నీస్మృతిపథంబున గోచరించునా? ఈతండు గుడుచు నిడు
ములనుగురించి యొకానొక గడియ యేనిఁ మదిని దలంతువా?
ఔరా! నే నెంతటి మందబుద్ధిని! నిరుపేదనగు నేనెక్కడ, మహా
దైశ్వర్యంబులను దులదూగు సమ్రాణ్ణినీమణి యెక్కడ!
ఆమె న న్నేల దలంచును? నాపై నేల నాసవహించు?

సీ. స్వర్ణాపగను క్రీడ - సలుపనేగును గాని
యరయునే పల్వల - మంచగున్న
తమ్మి పూదేనియ - ద్రావ నేగెడుగాని
తుమ్మి డాయునె? షట్ప-దమ్ము నెమ్మి?
గున్నమామిడి జేర గోర్కె - జెందునుగాని
వట మాశ్రయించునే - పరభృతంబు
నవరసాభిజ్ఞుని - గవయగోరునుగాని
చేల జేరునె కవి-తా లతాంగి
గీ. రాజితానంతభువనసా- మ్రాజ్యధవుని
రాజరాజుని బ్రాపు జే-రంగ నెంచు
గాని నాబోటి నిఱుపేద- వానిపొత్తు
రాగ మొదవంగ గోరునే రాజపుత్రి!

ఆ. అంగనాలోక మంతయు నవనీపతులనే యభిలషించు చుండెనా?
రాజ్యహీనులను వరించు భర్తృదారిక లింతకు క్రితంబు నెందరు
లేరు.

మ. తనరాజ్యం బదివర్గ మేలుకొన కాం-తారాంతరంబందునన్
మును జాత్యంధుల తల్లిదండ్రుల నతం-డుర్న్ పోషణ న్సల్పుచున్
తినకేకన్ ఫలపర్ణముల్ దిను ధరి-త్రీనాథునిన్ సత్యవం
తుని సావిత్రి వరించి చేకొన దహో - దుర్వారమోహోన్నతిన్

కాని, రాజ్యభ్రష్టులైనను రాజ వంశీయులను మాత్రమే ఆరా[illegible]నేత్రలు గ్రహించిరిగాని, సుక్షత్రియ కులంబునన్ బుట్టి హీనక్షత్ర నఖయేనియున్ క్షత్రియేతరులగేహంబు మెట్టునా? [illegible]! ఇది యొక క్లిష్టసమస్యవోలె గన్పట్టుచుండె... ...కాని కర్మప్రకృతి పరిణామం బతివిచిత్రంబుగదా!

గీ. బిచ్చమెత్తంగ తిరిగెడు - పేదవాడు
మాయురే కాంచగా రాజ-మౌళి యగును
నిరతిశయసంపదుడు ధర-ణీధవుండు
భళిర త్రుటిలోన యాచకు - పగిది మారు.

అట్టిచో నాకేనాటికేని మహిని పాలించుయోగంబు ప్రాప్తించకుండునా? పోని మ్మక్కప్పుడేని యావన్నెలాడి క్రన్ననన్ జేరి నన్ను మన్నించకుండునా! సరే. ఘటనాఘటనసమర్థుం డగు యనంతుని కృపాతిశయంబున నొకవేళ నవనీపాలనంబు ప్రాప్తించిన నెట్టకేలకు ప్రాప్తించును గాని కులం బెట్లు మార్పు జెందు? అయ్యో! అయ్యది జన్మాంతరంబునన్ గాని ఈభవంబునం దసంభవంబుగదా! (నవ్వుచు) ఔరా! నే నెంతటి కుశాగ్రబుద్ధిని! అల్పకులుండ నగుటచే నల్పబుద్ధియు నాక్రమించెగాబోలు! సమస్త చరాచరప్రపంచసృష్టిస్థితిలయకారకుండగు జగన్నాటకసూత్రధారి కీ జగజ్జాలంబున సాధ్యంబుగాని దెద్ది? భువనములనే తారుమారొనరించు పురాణపురుషునకు నొకానొక వ్యక్తికులంబు మార్పుజేయుటన నెంతటి గొప్పకార్యము? అట్టి పరాత్పరు నను

గ్రహమే యుండినచో నేవ్యక్తికేని స్వజాతి విహితంబగు తపో విశేషానుష్ఠాన సమాసాదిత "దృష్టజన్మవేదనీయం" బగు సదృష్టవిశేషంబుచే నుత్కృష్టజాతి విశ్వామిత్రునం దీశ్వరాదులకువలె గలుగవచ్చుగదా... పోనిమ్మన్నియును జేకూరెననుకొందము. నాటికేని యాచంచలాక్షి ప్రేమైకవీక్షణంబు లీ నా మూర్తిపై ననే ప్రసరించునను నమ్మక మేమి? అటులైన నిదివరకు మాత్రము నమ్మెటులకు?... ఏమని...? ఆపె నాహృదయేశ్వరి యని గాని, నే నామె హృదయేశ్వరుండనని నమ్మలేదే అంతటి పిచ్చినమ్మకము జెందుట కా మచ్చెకంటి నన్నే వరింతునని చెప్పినగదా!... ఆ...ఆ... చెప్పకేమి? బాగుగనే చెప్పితివి. హా! మనోహారీ లలితా! నీబోటి ప్రౌఢాంగనామణు లంతకన్న నిం కేమి చెప్పుదురు?

ఉ. కంతులతాంతమార్గణని-కాయములో యన దృక్చ్రయంబు ల
త్యంతముగా నిగుడ్చి దర-హాసము మోవిని తాండవింప నా
పొంతకు నేగుదెంచి యట - మోమిడి దక్షిణపాణి నాడు శు
ద్ధాంతమునందు నా కిడు వి-ధం బది చాలదొ? మ త్తకాశినీ!

వట్టిది, వట్టిది. కంకణంబుపై గల తమకంబుచే నా కానాడు కేలొసంగితివి గాని, నాపై బాళిచే పాణి నొసంగితివా? పోనిమ్ము. నిక్కమగు ప్రేమయే యున్నదనుకొందము. అట్లయినచో నిన్ను బాసి యీ నీప్రియుండు బోవ మిన్నకుండువా? అవును. పాపమా యన్నులమిన్న మిన్నకుండ కేమి చేయును? అబల లెందున నబలలేకదా? సుక్షత్రియ వంశజాతయగు కాంతకు స్వయంవరావకాశము ధర్మసిద్ధమైయున్నను అందుగూడ పిత్రాద్యనుజ్ఞ యావశ్యకంబుగదా! అదియునుగాక "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యను ధర్మసూత్రంబు వారి హృదయాశ్వంబుల గట్టివైచు చుండుగదా? వారి కిం కెట్టి సాహాయ్యము చేయ వలనుపడును?

చేతనైనంతవరకు తపింతును. అంతకు పైని నాక్రోశింతును.
పాప మంతకన్న నిం కేమి చేయనేర్తురు? అయ్యో! అటుల
యిన ఆనాహృదయేశ్వరి విలపించుచుండెనా! హా మనోహరీ!
కటకటా! కన్నీరు గార్చుచుంటివా? అబ్బా! ఆ నీ మనోహర
మందహాసవదనంబు కందువారెనా? ఆ నీవిశాలతరళనయనంబు
లశ్రుధారాప్లుతంబులయ్యెనా? ఆ నీ కోకిలరవంబు రవ్వ సే
యు కంఠస్వరంబు గద్గదిక వహించెనా? గద్గదిక వహించెనా?
అబ్బా...ఓర్వజాల నోర్వజాల...దుర్భరము, దుర్భరము. హా
మనోహరీ! హా లలితా! హా! (మూర్ఛిల్లును)

(యవనిక జారును)

---

ద్వితీయ రంగము: రేవానగరము

(పురుషవేషముతో లలిత ప్రవేశించును)

లలి—

చం. నిలయము వీడు చింత జన-నీ జనకుల్ విడిపోవువంత నె
చ్చెలి గనరామినార్తి వివ - శీకృతనాధువియోగతాపముల్
నిలువున నీఱు జేయ మర - ణింపగబోకను మొండికట్టెనై
నిలచితి ధారుణిన్ కరుణ-నింపెదొ? ద్రుంపెదొ? దైవమా యికన్.

అబ్బా! ఎంతని నడువగలను? నడచి నడచి పాదముల బొబ్బలెక్కె, దేహ
మంతయు వడకుచుండె. నో రెండుచుండె. భూమిపై నింక నొక్క
యడు గిడుటకును శక్తిలేకయున్న దాననే. హా అశ్వరాజమా!
గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు నీవునునిప్పుడే నన్ను బాసిపోతివా?
అకాలమృత్యువువాతన్ బడితివా? అయ్యో! నీకును నాస్నేహ
మంతటి హేతువయ్యెనా? అబ్బా పురం బంతయును దిరిగితినే!

అబ్బా! వీథివీథులఁ వెతకి వేసారితినే. అక్కటా! ఇక నెంతని వెతు
కగలను. పోనిమ్మా దొంగలపుణ్యమున నీదుస్తులైనను లభిం
చె, లేనిచో నిక నే బహు బన్నంబులకు బారమందునే? ప్రచ్ఛన్న
పురుషవేషధారి నే కాకయున్న కాంతను, జనపదంబుల నెట్టి కష్టం
బుల నొందియుందునోగదా! అబ్బా! ఎట్టులో ప్రాణంబులు బిగ
బట్టుకొని యీపట్టణంబం దింకను బరిశీలింతమన్న పైన నీయాకలి
బాధ భరింపరానిదయ్యెనే అయ్యో! ఎంతని సహింతు? దేనికని
యోర్తు? హా జగద్రక్షకా! కష్టములమీద కష్టములు మహాస్త్ర
ములవోలె సంధించుచుంటివా? దేవా! ఎందుల కీ విషమపరీక్ష.
నా నాథుని జూపుము. నన్ను భగ్నమనోరథను జేయకుము.
దయ జూపుము. మదుద్యమంబు విరమింపజాల. భారతీయాంగన
నగు నాచే నొక్కమాటు సమర్పితంబగు మద్హృదయ సింహాస
నము నన్యు డేనాటికైన నధిష్ఠింప నర్హుడగునా? అమూల్యంబగు
మదీయానురాగ రత్నోపహారార్హుండు పుష్పహాసుండుగా
కన్యుండు గానేరడు. ఇంత యేల? ఈ నా జీవితము నంతయు
నా జీవితేశ్వరుని యన్వేషణమునకే సమర్పించెద. ఈ భవంబు
నందసంభవంబైనను మరు జన్మంబునకైన మన్మనోహరుఁ
జేపట్టెద. తండ్రీ! యీ దీనురాలి ననుగ్రహింపుము. హృదయే
శ్వర సాన్నిధ్యముఁ జేర్పుము ......... అది యొక దేవతా
నిలయంబువోలె గన్పట్టుచున్నయది. స్వామిని దర్శించి రాత్రి
కందు విశ్రమించెద. (సమీపమునకు వెడలి) ఓహో! తరుచు
పాంథు లిందుఁ బ్రవేశింతురు గాబోలు. అల్లదే యందెవ్వరో కనం
బడుచున్నవారు. పరుండియుండెడి. నిద్రించుచుండెగాబోలు.
నిద్రించుచున్ననేమి? మేల్కొనియున్ననేమి? నన్నెరింగిన మానిసి
యైనగదా నాకు ప్రమాదము అదిమాత్ర మెట్లు? ఇదివర
కావ్యక్తి నన్నెరింగినను నిప్పుడు గుర్తించుట దుర్ఘటము గదా!

(అంత పుష్పహాసుని సమీపమునుండి వెడలుచు గుర్తించి చకితయై వెనుకంజవేసి) ఆఁ...ఆఁ...ఏమిది...ఏమిది...నా నాథుడు...నా మనోహరుడు (మరల గాంచి సంతోషముతో) నిజముగా నా హృదయాధి నాథుడే...ఏమిది, నా జీవితేశుని ముఖ మిట్లు వాడియున్నయది? హా! హృదయేశ్వరా! నీవును నాకై తపించుచుంటివా? ఆహా! ఏమి నా ప్రియుని యద్వితీయ విలాసము. (అని సమీపమునకు వంగి చూచుచుండును)

పుష్ప—(స్వప్నావస్థలో లలిత తనసమీపమున కరుదెంచినట్లుగా నెంచి హా మనోహారీ! రమ్ము రమ్ము. (అని తనరెండు బాహువులను పైకెత్తి కౌగిలించుకొన బోవును. లలిత కౌగిలియందు బడును. అంత పుష్పహాసుడు తెలివిగని దిగ్గన కూర్చుండి పురుషవేషధారి యగు లలితను గుర్తింపక పురుషునిగా నిశ్చయించి (స్వగ) ఔరా! ఎంతమోసము. ఈత డెవ్వడో యున్నతవంశీయుని వోలె నున్నవాడు. (ప్ర) అపరాధము క్షమింపుడు.

లలి—(కోప మభినయించుచు) క్షమించక చేయునదేమి? నీ కంటి కేను ప్రియురాలివోలె గన్పట్టుచుంటిని గాబోలు. అవును. అం దబద్ధ మేమున్నది? లేనిచో నింతపనికి సాహసింతువా? మంచిరసికు డవు, కాముకవ్యాపారమున గడుంగడు నారితేరితివి.

పుష్ప—(తలవంచి) కలవరపాటుచే గలుగు నకార్యమున కింతగా కనలదగదు. తెలియక తప్పిదం బొనర్చితినని యొప్పుకొనుచుంటిని గదా!

లలి—తప్పుకొనుట కొప్పుకొనక తప్పునా యేమి?

పుష్ప—ఆగ్రహింపకుడు.

లలి—నే నట్లొనర్చిన నీ వనుగ్రహింతువు గాబోలు.

పుష్ప—నాయది పొరబాటను చుంటినిగదా? పొరబాటు పురుషబుద్ధికి స్వతస్సిద్ధముగాన నాతప్పు క్షమింపుడు.

లలి—అయిన, నీవు పురుషుండవు, నేను పొలతినా యేమి? ఔరా! యే
మి నీజాణతనపు మాటలు.

పుష్ప—(నవ్వుచు) అయ్యా! నీవు పొలతి వనియును, లలిత వనియును
నే ననలేదు. ఎందుల కట్లు కోపింతురు?

లలి—(లోలో నవ్వుకొనుచు స్వ) అనిన మాత్రమేమి. పొలతినిగానా
లలితనుగానా! (ప్ర) ఆ...ఆ...న న్నొక ఆడుదానను చేయు
టయేగాక పైన నామంబుగూడ నిడుచుంటివా? చాలు. చాలు.
మెత్తనివారిని జూచిన నేరికైన ...అన్న ట్లున్నయది, మీ సం
భాషణము.

పుష్ప—ఎందుల కిట్టి దురభిప్రాయమును బొందెదరు? మాటవరుస
మాటయనుట వాడుకయాటచే పొలతి యనియును, లలితయని
యును నంటినిగాని, మి మ్మా పేరుతో పిలువలేదే.

లలి—ఇక ముందు పిలతువు.

పుష్ప—(స్వ) ఈతని కంఠస్వరంబు ము న్నెన్నడో వినిన ట్లున్నయది.
కాని యీతని నెప్పుడు చూచిన గుర్తుదోచదు. (ప్ర) అయ్యా!
నీ యందచందముల గాంచ నీవొక క్షత్రియకుల సంజాతుండ
వని తోచుచున్నయది.

లలి—(నవ్వుచు) మనోహరులగు మీకు నాయంద మంతటి యానంద
దాయకముగా నున్నదియా? ఓహో! అది సహజ మందరు
గాబోలు. కాని మీకుల మెయ్యది?

పుష్ప—(తలవంచి స్వ) అబ్బా! ఎందు బోయినను జాతి నా పాలిటి కశని
పాతమైనదే.

లలి—(నవ్వుచు) సంకోచింతురేల? మీరు కులములేనివారలా యేమి?

పుష్ప—కుల మెద్దియైననేమి? గుణము ప్రధానము.

లలి—ప్రసూనమును బట్టియే పరిమళ ముండును.

పుష్ప—అటులయిన రాధేయుని దుర్గుణంబు లేమి? సుయోధనుని సుగుణంబు లేమి?

లలి—(నవ్వుచు) ఓహో! ఇదియా తెలిసినది. బె స్తవారలా మీరు. (అంత కంకణంబు కనుబడునట్లు ముఖముపై స్వేదబిందువులు కొనగోటితో మీటుచుండును)

పుష్ప—(తలవంచుకొనియే) జాతి దైవాయత్తమైనది. అందునుగూర్చి యాక్షేపించిన ప్రయోజన ముండదు. (తలయెత్తికంకణముగాంచి యులికిపడి స్వ) ఆ...ఆ,..నామనోహారి ముంజేతి నలంకరింప బడు మణిమయ మండనం బీతని దండ నెట్లుండె? నాయనురాగ వల్లరికి ప్రేమపురస్సరంబుగా నాచే నొసగబడిన యీవలయ మీత డెట్లు ధరించె? (ఆతురతతో ప్ర) ఆకంకణం బెవ్వరిది?

లలి—(లోలోన నవ్వుకొనుచు స్వ) నానాధు డింకను నన్ను గుర్తించ లేదు. (ప్ర) ఏరిదో యయిన నాయొద్ద జేరు టెట్లు?

పుష్ప—అటు లయిన నీది యేనా?

లలి—(నవ్వుచు) కాదందువా?

పుష్ప—నీ కెట్లు లభించెను?

లలి—నా కొ కానొకవ్యక్తి యొసంగె.

పుష్ప—ఎందులకు?

లలి—ప్రాణదాన మొనర్చినందులకు.

పుష్ప—(త త్తరముతో) ఆ ..ఆ...ప్రాణదానమా? ఆయువతికి ప్రాణ దానమా? ఆపెకంతటి ప్రాణాపాయ మేరిమూలమున సంభవించె?

లలి—ఏమట్లాతురత పడియెదరు? (క్రిగంట జూచుచు) ఆబిడ మీ కేమి కావలయు?

పుష్ప—అబ్బా! ఆవిషయ మావల తెల్పెద, నాపె కట్టి యపాయ మే కతంబున ఘటిల్లె?

లలి—పురాకృతమున.

పుష్ప—అయ్యో? అదిగాదు. ఎవరిమూలమున?

లలి—చోరులమూలమున.

పుష్ప—(ఆశ్చర్యముతో) చోరులా? ఆసతీమణి చోరులపాలయ్యెనా! ఎచ్చట? అబ్బా యెంతని ప్రశ్నింతును? ఆయుదంత మంతయు దెల్పుడు.

లలి—నే నీ పట్టణంబునకు వచ్చుచుండ మధ్యకాంతార భాగంబున నొక యార్తనాదంబు వీనులంబడియె. అంత నే నావైపునకు బరువెత్తి కొందరుచోరులాలతాంగిని జుట్టుముట్టి పలువిధముల బాధపెట్టు చుండ గాంచితిని. అప్పుడు నే నా ముక్కడులఁ బారద్రోలి దిక్కులేని యాచక్కరబొమ్మ నక్కునఁ జేర్చి చెక్కిలి నొక్కుచు పొక్కకేయని యోదార్చితి. (క్రీగంట చూచుచుండును)

పుష్ప—(నిస్పృహతో స్వ) ఒకవంక నీత డాపె కొనరించినమహోప కారమున కెంతయో సంతసం బొదవుచున్నను చివర నీతడాడు కర్ణకఠోర వాక్యంబుల నప్రయత్నముగ నాగ్రహం బొదవుచున్న యదే.

లలి—అంత నాపె నా మహోపకారమునకు ప్రత్యుపకారముగా నీవలయద్వయ మొసంగి నన్ను ...... (అర్ధోక్తి)

పుష్ప—(స్వ)అక్కటా! నా యర్ధాంగి కెట్టి యిక్కట్టు లొదవె! ఆయా రామవిహారిణి యటవీతలంబున కేల నరుగుదెంచెనో గదా? అయ్యో! ఆమందయాన యిక్కెందుల కరుగుదెంచు? ఈ నా నిమిత్తమే నిలయంబు వీడియుండు. (ప్ర) ఇప్పు డాయిందీవరాక్షి యెందుండె?

లలి—(నవ్వుచు) తనమనోహారునియొద్ద.

పుష్ప—(విస్మయాక్రోశములతో) ఆఁ. ఆఁ. తన మనోహారునియొద్దనా? అసంభవము. అసత్యము పలుకుచుంటిరి, ఆమె యవివాహితగదా?

లలి—ఎటులఁ? పాణిగ్రహణ మయినదిగదా?

పుష్ప—(దుఃఖముతో) ఆ...ఏమి...అమ్మదవతిని బరిణయంబాడిరా? ఎప్పుడు?...ఎవరు?

లలి—(లోలోన నవ్వుకొనుచు) ఎప్పుడా? యీ కంకణ మిచ్చునప్పుడు ఎవరా...వీరు...(అని చమత్కారముగా నభినయించును)

పుష్ప—(దుఃఖాశ్చర్యములతో) మీరలా! నిజముగా నా భువనైక మోహిని మీ యర్ధాంగి యయ్యెనా?

లలి—ఆపె నా యర్ధాంగి యౌటయేగాదు. సర్వాంగియే యని తలంచుడు. మా యిరువురికిని భేద మణుమాత్రమును లేదు. ఆమెయే నేను, నేనే ఆమెను. ఇంత యేల? మా యిరువురిప్రాణ మొక్కటియే యని యెఱుంగుడు.

పుష్ప—(దుఃఖముతో, స్వ)

ఉ. హా! సరసీరుహేక్షణ! ర-థాంగతిరస్కృత మోహన స్తనీ!
మోసము జేసితే నను వి-మోహితచిత్తుని జేసి నాడు, పే
రాసలగొల్పి నే డొకని - హా వరియింతువె? సాహసింతువే!
దోసము గాదె యీగతి న-ధోగతి నట్ బడద్రోయ కామినీ?

(దుఃఖించుచు కొంత వడికి నప్రయత్నముగ) (ప్ర) హా! ప్రాణేశ్వరీ...

లలి—(అపవారించి) ఆఁ...ఆఁ...ఏమి మీ యాగడము. ఆపె నా ప్రాణ మనుచుండ మీ ప్రాణేశ్వరి యనుచుంటిరా? చాలు. చాలు. ఇప్పు డాపె నన్నవాడవు, ఇకముం దాపె గాదు, నీవే నా ప్రాణేశ్వరి వన్న నే చేయునదేమి? పురుషుడో, పూబోడియో యని యెఱుంగని బుద్ధిశాలికి పూర్వాపరస్మృతియుఁ గూడ నుండునా? పోనిం డేను తెలియకుండ నింతదనుక మీతో ప్రసంగించుట నాదియే లోపము. ఇకనైన తెలిసికొనుట మంచిది. మీ సరసత్వమున కిదే నమస్కారము. ఈమూర్తి నిక వెడల

నిందు. (అని శిరోవేష్టనము పడిపోవునటుల వంగి నమస్కరిం
చును. శిరోవేష్టనము శిరమునుండి పడును. కురులు దిగజారును.
లలిత తలవంచియే యుండును)

పుష్ప—(విభ్రాంతుడై) ఆహా! యేమి యీ శిరోజముల లావ
ణ్యము. ఈవ్యక్తి కృత్రిమ పురుషవేషధారిణి యగు పొలతియా!
ఏమి? (అంత లలిత ముసిముసి నగవులొలుక మోమెత్తును)

పుష్ప—(లలితను గుర్తించి యపరిమితానందావేశమున) హా! హనో
హరీ!... లలితా...!నీవా... నీ... వా... (అని కౌగిలించుకొన
బోయి పడిపోవును)

(తెరలో)

ఏమీ! లలితయా! లలితయా! నా నెచ్చెలి లలితయా! ఇందుండెనా!
నిక్కువముగ నిందుండెనా?

లలి—(సంతోషముతో) ఆహా! మగల నా యానంద కమలాకరంబు
నకు సుఖజలంబుల జాలువడియె. అల్లదే నా చెలి తిలకయు న
రుగుదెంచుచుండె. ఆహా! ఏమి యీ యపూర్వ సమ్మేళనము!

గీ. రాగడగిన ప్రదోషక-ళలతెఱంగు
పోగడంగిన ప్రత్యూష-పుణ్య విధాన
బొరయు విరియును మానవ - వ్యూహములకు
కష్టసముదాయ మనియెడు - కటికితమము.

(పురుషవస్తులు తీసివేయును)

తిల—(ప్రవేశించి) హా... లలితాపుష్పహాసులారా! . ధన్యోస్మి ధన్యో
స్మి. (అంత తిలక లలితసమీపమున కేగును. ఒండొరులు కౌగి
లించి కొందురు. పుష్పహాసుడు లేచి నిశ్చేష్టుడై వారలను గాం
చుచుండును. అంత ముప్పురు నిరుత్తరులై యపరిమితానందము
ననుభవించు చుందురు.

(తెరలో) అరే, పకడ్ పకడ్.

(అంత 4 గురు భటు లాకస్మికముగా వచ్చి పుష్పహాసుని పట్టు కొనెదరు. తిలకాసహితముగ లలిత కొంచెము దూర మేగి నిలువ బడి యుండును.)

పుష్ప—(తత్తరముతో విదలించివైచుచు) దురాత్ములారా! ఎవరు మీరు?...న న్నేల పట్టుకొనియెదరు?

1 భటు — మేము ధనంజయమహారాజుగారి భటులము.

తిల—చెలీ! యిక యేమున్నది. అయ్యో మనకొంప మునిగినది.

2 భటు—(పుష్పహాసునితో) నీకే పకడ్నేకు మాకీ మహారాజ్ హుకుం దియా, చలో బే, చలో.

పుష్ప—(దీనవదనుడై లలితవైపు చూచుచుండును)

లలి—(వడకుచు దుఃఖముతో) హా దైవమా! మరల నెంతలో నెంతటి ఘోరసంఘటన మొనరించితివి! హా దయామయా! మన్మనస్సం తోష యవనిక నప్పుడే పైకి లాగివైచితివా? అయ్యో! సుఖ మయంబగు నాపాత్రను మరల దుఃఖరంగమున దించితివా?

3 భ—(పుష్పహాసుని జూచి) నీవు మా యువరాజుగారి యెడ నొనరిం చిన నేరమునకై నిన్ను బట్టితెచ్చుటకు మహారాజుగారు మా కాజ్ఞ యొసంగిరి గాన మారుమాటాడక మావెనువెంట రమ్ము. (లాగికొని పోవుచు లలితా తిలకలను గాంచి గుర్తించి యాశ్చ ర్యముతో, స్వ) ఏమది? మహారాజ పుత్రికను సైతము నీతడే గొనివచ్చెనా? ఔరా! ఏమి వీని పోగాలము. (ప్ర) అమ్మా! సేవకుడు నమస్కరింపుచున్నవాడు. (నమస్కరించును)

లలి—(తలవంచి కన్నీరు దుడుచుకొనుచుండును)

3భ—అమ్మా! దుఃఖింపకుడు. ఇక నీతడు మి మ్మేమియు చేయజాలడు. భయ మొందకుడు. ఈతడు మీయెడ నొనరించిన చోరాపరాధ మునకును, తమ యన్నగారియెడ దొనరించిన నేరమునకును

మహారాజ సమక్షమున తగిన శిక్ష యనుభవింపగలడు. రండు. మీరు చోరులచే జిక్కిరని మీ తలిదండ్రులు నిద్రాహారములు లేక తపించు చున్నవారు.

తిల—(స్వ) అమ్మయ్య! బ్రతికిపోయితిమి.

లలి—(స్వ) న న్నెవ్వరో చోరు లెత్తుకొని పోయిరని నా జననీజనకులు తలంచుచుండిరిగాబోలు. దాన నా కెంతయో మేలొన గూడి నను దీన నాధుని కట్టి ముప్పు వాటిల్లునోగదా?

4 భ—(పుష్పహాసుని జూచి) అరేహల్లా, అరేహల్లా నీకీ ఎంత మోహం ఎంతమోహం చేసివుండావుబే. నీకీ పెండ్లి చేస్తాం, చలో బే చలో (పుష్పహాసుని లాగుకొని పోవుచుందురు)

పుష్ప—(వెడలుచు)

గీ. క్షణములోపల సుఖతటి - ద్గణము బరపు
కష్టనిర్ఘాతమును మరు - క్షణమునందె
దేవుడా యని యేడ్చ నె - త్రిపయి వైచు;
దేవదేవునిలీలల - తెలియవశమె?

(పుష్పహాసుని లాగుకొనిపోవుదురు. వెను వెంట నందరు నిష్క్రమింతురు)

(యవనిక జారును.)

ఇది పంచమాంకము



ఓం.

శ్రీ సీతారామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# పుష్పహాస



## షష్ఠాంకము



### ప్రథమ రంగము - సింధువారనగరము

(రాజు=ధనంజయుడు, రాణి=మదనమంజరి, మంత్రి=దేవముఖుడు, విచారగ్రస్తులై కూర్చొనియుండగా తెర యెత్తబడును)

దేవ—దేవా! ధైర్య మవలంబింపుడు. అమ్మా! ఊరడిల్లు డూరడిల్లుడు

ధనం—మంత్రీ! ఇంకేటి ధైర్యము. సుగుణవల్లియగు మా కుమారీ మతల్లిని బాసి, అయ్యో! మే మెట్లూరడిల్లగలము. (దుఃఖముతో) దేవీ!

ఉ. పుట్టినదాది పూవులనె - బొట్టియ నుంచి యమోఘప్రేముడిన్
ఎట్టటో పెంచినారము స-ఖీ! తగువానిని బట్టి యింక చే
పట్టి ముదంబు గూర్చునని - పట్టగరాని ప్రమోద మంద హా!
కట్టడి దైవ మీగతి న-కారణ వైరము బూనె నక్కటా?

హా హాతవిధీ! మాకెట్టి పాట్లు గల్పించితివి. హా కుమారీ! లలితా!

చ. పరిణయ మెట్టులో సలిపి - భర్తృకరాబ్జతలంబునందు నా
దరమున నప్పగించియు, కృ-తార్థుడ నౌదని ప్రత్యహంబు సం
బరమును బొందుచుండ నను - బాసియు తల్లిని వీడి నీదు సో
దరు విడనాడి కూరిమిసు-తా! ఇటు చోరుల జిక్కితే కటా!

మద—(దుఃఖ) హా బిడ్డా! నీపాలిటి కా దొంగ లెక్కడ దాపురించిరో కదా! అయ్యో! ఆదుష్టులు ని న్నింత కష్టపెట్టుచుండిరో కదా! హా తల్లీ! నీ వా నీచుల కేమి యపకార మొనరించితివి. లేక లేక కలిగితివి గదాయని ముద్దు మురిపెములతో పెంచుకొనుచుండ ఆపాపిష్ఠి దైవమునకు కనులు కుట్టె గాబోలు. హా కన్నతల్లీ! అయ్యో! మా కిక ది క్కెవ్వరు?

సీ చిన్ని చేతుల బట్టి - తిన్నగా నిం కేరు
వీణా శ్రుతుల మేళ - వింతురమ్మ
సర్వశాస్త్రార్థముల్ - శ్రవణపేయంబుగా
వినగ నిం కెవరు వి-న్పింతురమ్మ!
బోటు లందర గూర్చి - బొమ్మలపెండ్లిండ్ల
వేడ్క నిం కెవరు గా-వింతురమ్మ
బడిలోన గూర్చుండి - బుడిబుడి ముచ్చట్లు
చెవిని నిం కెవ్వరు - చెప్పుదురమ్మ!
గీ. అమ్మ! పెండిలి సేతు మా - యమ్మ! యన్న
నవ్వి సిగ్గిలువార లిం - కెవ్వరమ్మ
అనయమును మా:సు సన్నిధి - కనులు చల్ల
గా, తిరుగువా రి కెవ రమ్మ - కన్నతల్లి.

దేవ—తల్లీ! అధైర్య మూనకుడు. ఆ దురాత్ములను బట్టి తెచ్చుటకు నన్ని దిశలకును భటుల నంపియుంటిమిగదా? ఎం దేనియును వారు జిక్కకుందురా?

మద— అయ్యో! మా కంతటి భాగ్యముగూడనా?

ధనం—దేవముఖా! ఏల నీ కీ భ్రాంతి· అల్లుని విషయమై నేటివరకును ప్రయత్నించి యెంత కనుగొనజాలితిమో యిదియును నంతియే యనుకొనుము. అక్కటా! నా జీవింతం బంతయు దుఃఖ భాజనము సుమా!

గీ. తిండియును నీరు వదలి రా - త్రింబవళ్లు
నేడ్చితిని నల్లునకు కొన్ని - యేండ్లు నపుడు
తరుణపతి కూతు కటుల నే - ధైర్య ముడిగి,
యేడ్చుచుంటి సచివవరా! - ఇపుడు మరల.

దేవ—దేవా! చోరు లా యంతిపురమున నెటులు ప్రవేశించిరో గా?

ధనం—(దుఃఖ) ఎటులనా? మా ప్రారబ్ధసాహాయ్యమున.

దేవ—అ విషయ మొకింత సందేహాస్పదముగా నున్నదని తలంతును. తస్కరులు కేవలము ధనాపహరణమునకే ప్రయత్నింతురుగాని, ఇట్టి కార్యాచరణమున కేల గడంగుదురు?

ధనం—అటులయిన శాత్రవు లందువా?

దేవ—అదిమాత్ర మెట్లు? శత్రుత్వమున్న సముల సాధింపజూతురుగాని, అబలల సాధింప నెంతురా శత్రువులు?

ధనం—(దుఃఖ) మరి నా సుగుణఖని లలితాకుమారి యేమయ్యె!

దేవ—కారణము దురూహముగా నున్నది.

ధనం—అమాత్యవర్యా! కానికాలమున ప్రాప్తించు కడగండ్లకు కారణ ముగూడ యొండుండునా? ఇంతకు మాదురదృష్టమే మూల కారణము.

దేవ—కానిండు కష్టములు సౌఖ్యహేతువులని బుధులు వాకొనుచుం దురు గదా?

ధనం—(దుఃఖ) అయ్యో! మా కింకను సౌఖ్యమును సంతోషమును గూడనా? కులహీనునకు కులీనత ప్రాప్తించునా! అత్యంతసుఖ ప్రదాయిని, యఖిలశానంద సంధాయిని, మాకుమారి, మాలలి తాకుమారితోడనే మాసర్వస్వమును పోయినది. (లలిత నుద్దే శించి) హా కన్నతల్లీ! ఇక మే మెవ్వరిని జూచుకొని జీవింతుము?

మ. చెలుల న్గూడి మరాళమందగతుల - న్జిరాడ పర్యంత భా
గ్యలతాంకూరముఁబోలె మాయెదుట బి-డ్డా! ఇంక నెవ్వారలే
మెలమెల్ల న్దిరుగాడువారలు సదా - మేల్గాథల న్దెల్పి మ
మ్మలరం జేసెడువార లెవ్వ రిక న-మ్మా! మాకు ది క్కె-వ్వరే!

మద—హా పరాత్పరా! మే మీ చింతానలంబున జీవితపర్యంతమును ప్రగ్గు చుండవలసినదేనా? మాముద్దుబిడ్డను మాకనులకింక జూపవా? హా దయామయా! మే మేమి యపరాధ మొనరించితిమి? కరుణాసముద్రుడవే, మాకన్నబిడ్డను మాకు జూపుము. మా చిన్నతల్లిని మాయొద్ద జేర్పుము. తండ్రీ! మే మీ దుఃఖమును భరింపజాలము. అయ్యో భరింపజాలము.

దేవ—తల్లీ! దుఃఖింపకుడు. కానిండు, కాలచక్ర మెంతలో మార్పు జెందగలదు? (నేపథ్యమున ప్రతీహారి ప్రవేశించును)

ప్రతీ—దేవరవారికి జయము జయము.

దేవ—విశేషము లేమి?

ప్రతీ—దొంగ దొరికినాడట. చిన్నమ్మగారిని తీసుకొని భటు లేతెంచుచున్నవారు.

ధనం-మద— (సంతోష విస్మయావేశములతో) ఆ...ఆ...చిన్నమ్మయా! మా చిన్నమ్మ లలితమ్మయా! వచ్చుచుండెనా? ఏదీ! మాయమ్మ యేదీ! యేదీ! (అని దిగ్గునలేచి ముందునకు వత్తురు. అంత నొక భటునితో తిలకయు, లలితయు ప్రవేశింతురు)

ద-మ—హా! కన్నతల్లీ! (అని లలితను కౌగిలించుకొని యానంద బాష్పములు రాల్చుచుందురు)

సుం—(పరువెత్తుకొని వచ్చి) చెల్లీ! వచ్చితివా! (లలిత సమీపమునకేగును)

మద—అమ్మా! నిన్నా దురాత్ము లెట్టి కష్టముల పాల్జేసిరో కదా! తల్లీ

చం. అడుగవు ఆకలిగా గొనియు - నమ్మరో! యన్నము బెట్టుమంచు నీ
రడుగవు దప్పిగొన్న, తన-యా! యెటులో గ్రహియించి యింత మే
మిడిన భుజించి క్రోలెదవు;- ఏగతి నోర్చితివమ్మ బన్నమం;
దడలక నెట్లు చోరనివ-హంబున నుండితివమ్మ తల్లిరో!

ధనం—కుమారీ! ఆ దురాత్ముల నిప్పుడే తగినరీతి శిక్షింతు రమ్మా.
(అంత నందరు నాసనముల నధిష్ఠింతురు. లలిత వారికి వెనుక భాగమున తల వంచి నిలువబడియుండును. తిలక యాపె ప్రక్క నుండును)

(పుష్పహాసు నిరువురు భటులు గొనివత్తురు)

సుంద—(పుష్పహాసుని గాంచి, దిగ్గునలేచి) తండ్రీ! పారిపోయిన వల్లె వాడదే పట్టుబడినవాడు. అబ్బా! నా డీతని ముష్టిఘాతమున గలిగిన బాధ నేటివరకును తగ్గినదికాదు. జనకా! చూడుము, నా వీపున నెంతమచ్చ పడినదో! (వీపు చూపి బాధ నభినయించుచున్నా) కానిమ్ము. నేను వీని మచ్చమాయింతును. (పుష్పహాసుని జూచి పండ్లు గొరుకును)

ధనం—భటులారా! ఈపాపి నాకుమారునియం దొనరించిన నేరమును గురించి తదుపరి విచారించెదను. ముందు నాతనయను గొంపోయిన ముచ్చుల నింపు తెండు. ఆ దుండగుల శిరంబుల జెండు వరకు నా కొండేమియుం దోచదు పొండు.

భటు—మహారాజా! తమ కుమారీమణిని గొంపోయిన దొంగవాడు మరెవ్వడో కాదు, యీతడే. శేవానగరమున నొక దేవాలయమున నీతడు వీరితో గలసియుండ మేము బట్టుకొంటిమి.

ధనం—(క్రోధఘూర్ణిత మానసుడై)

శా. ఓరా! హీనకులాధమాధమ! మదాం-ధా పాపభూయిష్ఠ దు
ష్టా! రాకేందునిభాస్య నాతనయ నా- రా! దొంగవై కొంచు శుం

హా! రాత్రించరుపోలె పారెదవె కం-ఠబంధూనగా బ్రాణముల్
క్రూరా! నిల్పుకొనంగ శక్య మొకో! నీ-కు న్నింక నోక్రమ్మిక్కడీ.

ఛీ నీచా! నీవు నాపాలిటి కాలాహివని యెఱుంగక విద్యాదుగ్ధముల బోసి చిరకాలము బెంచితినే. కృతఘ్నుడా! తిన్నయింటి వాసములనే యెన్నగడంగితివా? మేకవన్నియ పులివని యెఱుంగక నిన్నింత కాలమునుండియు నమ్మి మోసపోయితిని. చూడుము. నీదుండగముల కిప్పుడే తగిన ఫల మనుభవింతువు. భటులారా! కారాగారబద్ధుండగు నీదురాత్ము తండ్రిని సైత మిందు గొని రండు.

(భటులు నిష్క్రమించి మరల గుహునితో బ్రవేశింతురు)

ధనం—భటులారా! (పుష్పహాసుని జూపుచు) ముందా పాపిశిరంబు మీ మీ కరవాలంబుల కెరజేయుడు. ఇదే నాయాజ్ఞ పొండు.

భటు—చిత్తము. (అని పుష్పహాసుని లాగుచుందురు)

గుహు—(దుఃఖముతో) సామీ! సామీ! మీపాదాల కాడోణ్ణి. నా బిడ్డణ్ణి రచ్చించుండి సామీ! దిక్కులేనోణ్ణి, కటాచ్చించుండీ దేవరా! మీదాసుణ్ణి దొరా! (అని బోర్లగిలబడి యేడ్చుచుండు)

ధనం—ఛీ దురాత్మా! నీకొడుకు చేసిన దుండగముల కింకను రక్షింపవలయునా? దుర్మతీ! నీ వా నీచునకు తండ్రి వగుటచే నీవును దండనీయుడవే, పొమ్ము యావజ్జీవిత ద్వీపాంతరవాసశిక్ష ననుభవింపుము.

గుహు—అన్నాయం అన్నాయం దొరా! తెలవకసేత్తే తప్పుసేసిండేమో దొరా! మీపాదాలకాడ పడుండేవాణ్ణి ఛమించుండి దేవరా!

ధనం—ఛీ నీచా! నోరు మూయుము. నీ కొమరుది న్యాయము, నాది యన్యాయమా? భటులారా! యింకను జూతురేల? (పుష్పహా

సుని జూపుచు) ముందా పాపిని ఖండ ఖండములుగా జెంకుము. సత్వరము పొందు.

భటు—(పుష్పహాసుని లాగుచు) ఆ చే ఆవ్.

(పుష్పహాసుడు కన్నీరు గార్చుచు లలితవైపు జూచును)

లలి—(దుఃఖముతో స్వ) హా మనోహరా! పోవుచుంటివా? అయ్యో యిక నాగతి యేమి?

గుహు—(స్వ) అయ్యో ఎట్టయినా యీడు నాకింక దక్కేటట్టు లేదు. (ప్ర) దొరా!.........

ధనం—(గంభీరముతో) ఏమి?

గుహు—ఈడు...నా...(జంకును)

ధనం—దుష్టా! చెప్పదలచిన దెద్దియో త్వరగ జెప్పుము.

గుహు—దేవరా...యీడు...నా...కొడుకు...గా...డు.

ధనం—(నవ్వుచు) ఓరి వృద్ధజంబుకమా! యీతండు నీకొడుకు గాడని సంతమాత్రమున నే నిన్ను వదలెద ననుకొంటివా?

గుహు—దేవరా! మీపాదాలతోడు, నాబువ్వతోడు, సత్తెం సామీ!

దేవ—దేవా! ఇం దేదియో రహస్య మున్నట్లున్నయది. సామోపాయమున నద్దానిని వెల్లడింపజేయుట మంచిదని తలంతును. (గుహునితో) ఓరి గుహుడా! అటు లయిన నాత డెవని కొమరుండు?

(పుష్పహాసుని జూపును)

గుహు—(వడకుచు) అపశారం దొరా!

దేవ—అది యెద్దియో భయపడక తెలియజేయుము. నిన్ను విడిచి పుత్తుము.

గుహు—ఆగ్గర మొత్తుందేమో దేవరా!

ధనం—ఆగ్రహ మేల, యనుగ్రహామే కలుగును. ఆత డెవ్వడో సత్వరంబుగ తెలుపుము.

గుహు—(ఏడ్చుచు) సిత్తంబాబూ! సిచ్చిత్తారేమో దేవరా! ఇంటి కెల్లి ఆకాయితం తీసుకొత్తా దొరా!

దేవ—ఏమి కాగితమురా!

గుహు—ఆసవిత్తారముండే కాయితం దేవరా!

ధన—(స్వ) ఔరా? నిజముగా నిందేదియో పరమరహస్య మున్న యది. (ప్ర) భటులారా! యీతని కుటీరంబునకు వీనిం గొంపోయి మరల వేగమే నింపు తెండు.

భటు—చిత్తము. (గుహునితో నిష్క్రమింతురు)

పుష్ప (స్వ) ఏమిది? నాజనకు డీ విధముగా బలుకుచున్నవాడు. నిజముగా నే నీతని కన్నకుమారుండను గానా? వట్టిది వట్టిది. వీరి బారినుండి తప్పించుకొనుటకై యీత డిట్లు బొంకుచున్న వాడు.

(భటులతో గుహుడు ప్రవేశించి జీర్ణపత్రిక నొకదానిని చేత బట్టుకొని భయముచే వడకుచుండును)

ధనం—మంత్రీ! అం దేమి లిఖయింపబడెనో చదువుము.

దేవ—చిత్తము. (అని పత్రికను గైకొని) దేవా! సావధానులు గండు. (చదువును)

"నా ప్రియ సోదరుడు ధనంజయునకు—

ధనం—(దుఃఖాశ్చర్యములతో) ఆఁ...ఆఁ...నా సోదరి...నా సోదరి గంధర్వ దత్తచే లిఖింపబడెనా? ఏదీ...ఏదీ...చదువుము.

దేవ—(చదువును) "సోదరా!...ఘోరము...ఘోరము......మహా ఘోరము...శాత్రవులు...అర్ధరాత్రమున...నా నాధుని... నా ప్రాణనాధుని...అయ్యో యిక వ్రాయజాల...యిక వ్రాయ జాల...హా తండ్రీ...నేనును...నా నాధుని...జేరుచుంటిని... యీ లోకమును...బాయుచుంటిని...మిమ్ములను వీడుచుంటిని.

ధనం—(దుఃఖముచే) హా! సోదరీ...హా! స్యాలకా...

(మదన మంజరి, లలిత దుఃఖించుచుందురు)

దేవ—(చదువును) "సోదరా! నాబాలుని...నా చిన్ని బాలుని...ఈ పల్లె...వాని...కప్పగించితిని. పసిపాప...నా తనయుని...నీ ముద్దు లల్లుని...నీయొద్ద జేర్చుకొనుము. తండ్రీ! నాబిడ్డ...నీ బిడ్డయే. దక్కించుకొనుము. రక్షించుకొనుము. ఆ భారమంతయు నీ నెత్తిపైన బెట్టి, పోవుచుంటి. సోదరా!...పోవుచుంటి.

ఇట్లు,
మరణ సన్నిహిత,
గంధర్వదత్త.

ధనం—(పరమాశ్చర్యమున) ఆ...ఆ...నాఅల్లుని యీపల్లెవాని కప్పగించెనా? (దిగ్గనలేచి) ఏమీ? అత డీతడా! నాముద్దులల్లు డీతడా? హాతండ్రీ (అని పుష్పహాసుని కౌగిలించుకొనును. భటులు దూరముగా పర్వెత్తుదురు. పుష్పహాసుడు తెల్లబోయి చూచు చుండును)

లలి—(సంతోష విస్మయావేశమున) హా! చెలీ బ్రతికితిని (తిలకను కౌగిలించుకొనును)

తిల—(జనాంతికముగ) సఖీ! నీప్రియుని భగవంతుడే నీనాథునిగ సృజించెనమ్మా!

సుంద—(స్వ) ఔరా! ప్రబలవిరోధి యెంతలో నా బావ యయ్యెను!

పుష్ప—(ఆశ్చర్య నిమగ్నుడై-స్వ) ఏమిది? కలయా? కాదు, కాదు... జాగ్రదవస్థలో స్వప్న మేల సంభవించును? ఔరా! ఏమి యీ విచిత్రదృశ్యము! ఏ నొక మహారాజపుత్రుడనా! ఏమి నామహాదశ! యీనాహృదయేశ్వరి పుట్టుకతోడనే నాయర్ధాంగి యయ్యెనా? అహో యేమి నాపూర్వపుణ్యము! ఏమి నా భాగ్యము!

ఓ పరాత్పరా! నీలీల లతిచిత్రములు, నీ చైదము లమోఘములు, నీవిలాసము లత్యంతవినోదకరములు. ఎట్టివాని నెంతలో నెంతటి వానిగా నొనర్చితివి! ఎట్టి యపూర్వసంఘటన మొనరించితివి! ఓ ఘటనాఘటన ధురీణా! నేడీ నా చరిత్రమూలమున సార్థక నామ ధేయుండ వైతివి. ఓజగన్నివాసా! నీ యవ్యాజానురాగమున కీ దాసు డనేక సహస్రకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నవాడు.

ధనం—(పుష్పహాసుని భుజముపై చేయివైచి) నాయనా! పుష్పహాసా! నీవింత కాలమునుండియు మసిపాతను దాపబడు మాణిక్యంబు వోలె పల్లెవానియింట నుంపబడితివా? తండ్రీ! నావలె నీవు సైత మీ మాయావిచే నింతకాలమునుండియు మోసగింపబడు చుంటివా? పోనిమ్మిప్పటికైనను మనయందా పరమేశ్వరునకు సంపూర్ణానుగ్రహము గలిగె నంతియే చాలు రమ్మా. (అని తన సమీపమున నొక యాసనమున నుపవిష్టుం జేసి తానును గూర్చుండి గుహుని గాంచి క్రోధఘూర్ణిత మానసుండై) ఓరి వృద్ధ గృధ్రమా? ఎంతమోస మొనరించితివిరా! మోస మొనరించు టయేగాక నీవీసమయమున నీవిషయముఁ దెలుపకున్న నన్యాయముగ నాయల్లుని నీ పొట్టబెట్టి యిన్ని నీళ్ళువదలియుందువే? దుర్మతీ! అప్పుడే నాయల్లుని నా కేల యప్పగింపవైతివిరా!

గుహు—(భయముచే వడకుచు గద్గదికతో) అపశారం దొరా!

దేవ—పల్లెవాడా! నీ కాపట్టణంబున కేల పోయితివి? నీ కీ రాజకుమారుం డెట్లు లభించె? ఆయుదంత మంతయు దెల్పుము.

గుహు—బాబూ! మొదట నాదా గామమే బాబు. అయితే దొరా! అప్పుడా దొరోరింట్లో సేవకుణ్ణిగా జీవిత్తుండా. యిట్టుండాలక, వొకనాడు యెవరో యిరోదులంటశాబు. అద్దంరాతిరికాడ ఆ మారాజోర్ని సంపేశారు. అప్పుడా దొరసాని యీబిడ్డణ్ణి నా

సేతుల్లో బెట్టి ఆకాయితంమీద యేందో రాసి నాకిచ్చి, యీ దొరోరికి అప్పసెప్పమని ఆతల్లి సేతులకుండే బూసనాలుదీసి నా కిచ్చింది బాబూ!

ధనం—ఓరీ! నీచా! నాడా కంకణము నా కొసంగుచు నేయొకనో దారి కినదని మాయమాటలు చెప్పితివి గదరా!

గుహు—అపశారం. యేలికా! అపశారం.

దేవ—ఆం. తరువాత యేమి జరిగినది?

గుహు—ఆ మోపున సిత్తం తల్లీ అని నే నొత్తుండాలక, దొరా! యేమని సెపుదును. ఆమాతల్లి అగ్గిలో బడి... (యేడ్చును)

(అందరు కన్నీరు పెట్టుదురు)

పుష్ప—(శోక సంతప్తచిత్తుడై) హా! తలిదండ్రులారా! మీ కెట్టి దుర్మరణంబు సంభవించె.

దేవ—సరే. ఆ విషయమును గురించి నీ విక చెప్పనక్కరలేదు. తరువాత బాలుడగు నీతని నీ మహారాజుగారి కేల సమర్పింపవైతివి?

గుహు—దొరా! సమర్పిత్తామనే మాయింటికి తీసికెల్లే. తీసికెల్లి, యీ సవిత్తారమంతా మా ముసలిదానితో సెప్పే దొరా! సెప్పే తల్కి అదే సేసింది బాబూ! ఆముండే సేసింది.

దేవ—అది యేమి చేసినదిరా?

గుహు—మనకు పిల్లలు లేరుగందా, యీ పిల్లోణ్ణి పెంచుకుంటే యీ రహస్సెం వోడికి తెలుత్తుందని నే నొత్తుంటే నాకడ్డం దగిలింది. బాబూ! యింతే దొరా! యీ యపశారమంతా దానిదే బాబూ! యింకీ ముసలోణ్ణి రచ్చిత్తే రచ్చించండి, బచ్చిత్తే బచ్చిచండి. (అని రాజుగారి కాళ్ళముందు బడి యేడ్చుచుండును)

పుష్ప—(ధనంజయునితో) మామా! నాప్రార్థన యొకం డాలకింపుడు. ఈతడు మన కేమియు నపకార మొనరించియుండలేదు. అంతే

యేకాక నా చేతడు నాకొనర్చిన మహోపకారమునకు వీనికి నే నెంతయు కృతజ్ఞుడను. ఆసమయమున బాలుండనగు నన్నీతడు గొనిరాకయున్నచో నాకును నాతలిదండ్రులగతియే పట్టియుండెడిది. ఈతం డనపత్యుం డౌటచే నన్ను తమ కప్పగింప జాలడయ్యె. నన్నీత డెంతయు పుత్రవాత్సల్యమున బెంచుచుండెడి వాడు కాన నీతని......

ధన—తంత్రీ, పుష్పహాసా! నీ స్వానుభూతి కెంతయు సంతసించితిని. (గుహునిజూచి) గుహుడా! నాడు మా కొనరించినమహోప కారమ్మును గుఱించి నిన్ను క్షమించితిని పొమ్ము. భటులారా! ధనాగారమున కీతని గొంపోయి వలయునంత ధన మిప్పించుడు, పొండు.

భటు—చిత్తము మహారాజా!

గుహు—దండాలు దొరా! దండాలు. (అని నమస్కరించి పుష్పహాసుని జూచుచు కన్నీరు గార్చుచు భటులతో నిష్క్రమించును)

ధనం—సచివవరా! ఇంతకాలము నుండియు నీ నా భాగధేయమును గుర్తింప జాలకపోయితిమిగదా?

దేవ—ప్రభూ! నేడుమాత్రము మనము గ్రహింప జాలితిమా? ఆపల్లె వాడైనను నిక వాని కెటులైన దక్కడనునుద్దేశమున నా రహస్యంబు వెల్లడించెనేగాని లేనిచో నేడుమాత్రము వాడు దెల్పియుండునా?

ధనం—నిజము, నిజము. (పుష్పహాసుని జూచి) భాగినేయా! నీ వొనరించిన యపరాధము లపరాధములు గాక మనపాలిటి శ్రేయోదాయకము లయ్యె సుమా?

పుష్ప—మాతులా! నాపై మోపబడిన రెండవ నేరమునకు నేను బాధ్యుండను గాజాలను!

సుంద—మొదటి నేరమున కైనను నొప్పుకొనక తప్పునా?

లిల—నిజము. నిజము. మహారాజా! మ న్నాత్మలను గొంపోయి యుండ లేదు. ఈతని సౌందర్య సౌజన్య సౌశీల్యాది సద్గుణశృంఖలలే మమ్ము గొంపోయినవి.

ధనం—(పుష్పహాసునితో) ఏమీ! నీ వా నేరమును చేయలేదా? అయ్యో! తండ్రీ! ని న్నెంతగా తూలనాడితిని.

గీ. నేర మొనరింతు వని నిన్ను - నిరపరాధి
సకట యనరానిమాటల - నంటినయ్య,
ఇడగరానట్టి శిక్ష యొం - డిడితి నయ్య!
అల్లుడా, నన్ను మన్నింపు - మయ్య తండ్రి.

పుష్ప—మామా! తమ రనరానిమాట లనుటకతననే యీదృశ ఫలం బనుభవింప గల్గితి. ఆ ఘోరతరశిక్షయే నాకు తమ సమక్షముగా గూర్చె. అయ్యవి నా కత్యంతసుఖకరంబులు గాని దుఃఖాకరం బులు గావు.

ధనం—దేవీ! నేటితో మనకష్టంబు లన్నియు గతించినయవి. మన మెం తటి ధన్యాత్ములమో చూడుము. ఈ యిరువురిబిడ్డల నొకే ముహూర్తమున సమకూర్చి యానతలోకవిపన్నివారకుడు మనల జరితార్థులగా జేసె సుమా.

మద—నాథా! ఈ దీనురాలికోర్కె యొండుగలదు. చిత్తగింతురేని.

ధనం—ప్రియా! ఇంతటి సంతోషదాయకంబగు సమయంబున నీవు కోరుటయు, నేను నిరాకరించుటయునా? నీవాంఛితం బెయ్యది?

మద—(అనుమానించుచు) ఈసుముహూర్తముననే... (లలితను దగ్గ రకు తీసుకొనును, లలిత తల వంచును)

ధనం—(నవ్వుచు) ప్రేయసీ, ఇదియా నీకోరిక. అటులనే కావింతము. ఇంతటి మహోత్కృష్ట సమయమున నాకోరంతమాత్ర మేల? "శుభస్య శీఘ్రమ్మ" నియుగదా?

తిల—(స్వ) అందరకును కావలసిన దదియే.

మద—తిలకా, నీవేగి మంగళద్రవ్యముల సత్వరంబుగా గైకొనిరమ్ము.

తిల—చిత్తము. (అని వెడలి పుష్పదామములు అక్షతలు మొదలు గాగల పళ్లెరములతో వెంటనే ప్రవేశించుచు)

ధనం—మంత్రిపుంగవా! పరిణయంబు విధివిధానంబుగా జరుపవలెగదా? పరికరంబు లన్నియు సిద్ధపరుపుము.

దేవ—చిత్తము.

తిల—(స్వ) పాపము! జరుగవలసిన విధానము లన్నియు నిదివరకే జరుపుకొనిరని మీ రెరుంగరు గదా?

మద—నాథా! విధ్యుక్తముల నన్నియు నావల నిర్వర్తింతము. ఈ శుభ ముహూర్తమున వధూవరుల గాంచి సంతసింతము. (అని లలితను దగ్గఱకు తీసుకొని) తల్లీ! యీ సుమదామంబుచే నీ నాథు నలంకరింపుము. (పుష్పమాలిక యిచ్చును)

ధనం—(పుష్పహాసుని దగ్గరకు తీసుకొని) తండ్రీ! పుష్పహాసా!

గీ. సుగుణముల బంతి మేల్మి భా-సురవలంతి
సొబగులకు దొంతి చంద్రికా - శుభ్రదంతి
మాదు కూర్మిపడంతి స - న్మానకాంతి
ఇంతిగా గొని మ మ్మొద్ధ-రింపుమయ్య!

(పుష్పమాలిక యిచ్చును)

పుష్ప—(గైకొని స్వ,) ఆహా యేమి నా భాగ్యము.

గీ. అబ్బునో లేదో యట్టి భా-గ్యం బటంచు
నహరహంబును నెద్దాని-కై తపింతొ

అద్ది నిర్నిమిత్తముగ నే - డబ్బుచుండె
హాయిరే నాదుజన్మ కృ-తార్థ మయ్యె.

(లలితమెడలో పుష్పహారము వైచును, లలిత సిగ్గుచే నసుమానించును)

పుష్ప —(స్వ)

చం. ఎరుగదు మున్ను కంకణము - నేను కరమ్మున బెట్టుచుండ నా
డెరుగదు కైతవాకృతిని - నెంతయు వింతలు బల్కుచుండి నా
సరస మెలంగుచున్న నిటు - చయ్యన నెయ్యెడనుండి నేడె యీ
తరళమృగీవిలోచనకు - దాపర మయ్యెనో సిగ్గు దొంతరల్.

తిల—(లలితను సమీపించి జనాంతికముగ) చెలీ! సిగ్గేలనే?

(అని పుష్పహాసుని జూచి నవ్వును)

పుష్ప—(స్వ) తిలకా! నీవు మాపాలిటి కల్పలతికవు సుమా!

(అంత లలిత పుష్పహాసుని మెడలో పుష్పమాలిక వైచును,

అందరు వధూవరులపై పుష్పాక్షతలు చల్లుదురు)

తిల—(స్వ) నాచే నాటబడిన బీజ మిప్పటికి ఫలించినది. ఔరా. కంక
ణమా! ఎ త విచిత్ర నాటక మాడించితివే?

లలి—జననీ జనకులారా! వందనములు.

ధ-మ—దీర్ఘ సుమంగలీ భవ, దీర్ఘ సుమంగలీ భవ,

పుష్ప—అత్తమామలారా! అభివాదనములు!

ధమ—సుఖీ భవ, సుఖీ భవ.

లలి—అన్నా, నమస్కారములు.

సుం—సుపుత్రపుత్రికావాప్తి రస్తు.

పుష్ప—(నవ్వుచు) బావా! నా నేరమును మన్నింపుము

(సుందరుడు తల వంచును)

**ధనం**—భాగినేయా! పుష్పహాసా! నేటికి మనచింత లన్నియు నంతరించినయవి. మహదానందాబ్ధి నోలలాడు చుంటిమి. మాతనయను గ్రహించి మమ్ములను ధన్యాత్ములను జేసితివి. తండ్రీ! ఇట్టి మహోత్కృష్ట సమయమున నీవు కోరదగిన దెద్దియేని యున్నఁ గోరుము.

**పుష్ప**—మామా! ఘటనాఘటనసమర్థుఁడగు పరాత్పరుని యపారకృపాతిరేకంబున సర్వమనోభీష్టంబులును సిద్ధించె. అంతకన్న నింకేమి కావలయు? అయిన నిట్లగుఁగాక,

భరతవాక్యము

చం. ఇల గల సర్వమానవులు - నీశు భజించి తరింత్రు గాత, భర్తలయెడ భక్తి గల్గియు పురంధ్రులు గాంతురు గాత సద్గతుల్
కలిమి సవర్ణ దంపతులు లఖండసుఖంబుల గాంత్రు గావుత కళల మనోజ్ఞమై వెలయు - గావుత సత్కవి కావ్యపుంజముల్.

**ధనం**—తథాస్తు.

యవనిక జారును.

గద్యము

ఇది శ్రీసీతారామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితారంభుండును సుజనవిధేయుండును అన్నపూర్ణమాంబా నారసింహార్య పుత్రుండను కాశీవిశ్వనాథాఖ్య విరచిత పుష్పహాసాభిఖ్యదృశ్యప్రబంధంబు సర్వంబు సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీసీతారామచంద్రార్పణ మస్తు.



# తప్పు ఒప్పుల పట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | యుంట | యుండుట |
| 3 | 15 | మ. నరసింహార్యతనూభవుం డనుజగారన్ దేవరశ్రేష్ఠిసుస్థిర వంశోద్భవుచే రచింపబడె కాశీ విశ్వనాథాఖ్యుచే | మ. నరసింహాగ్రణి కూర్మినందనునిచేతన్ వ్రాయగానయ్యె సుస్థిరతన్ దేవరసెట్టి వంశభవు కాశీవిశ్వనాథాఖ్యుచేన్ |
| 3 | 22 | డోళాందో | డోలాందో |
| 4 | 3 | గాంచకనుగా | గాంచకయ కాం |
| 4 | 14 | విశ్రాంతులైన | విశ్రాంతునైన |
| 12 | 18 | లావణ్యా | లావణ్యు |
| 20 | 25 | (పుష్పహాసుడు అని చదివి) | (పు. హా. అని చదివి) |
| 25 | 5 | బిరుదముల్ | బిరుదమున్ |
| 35 | 14 | అంగనన్ | అంగనా! |
| 38 | 3 | వగ్రాంతర | వక్త్రాంతర |
| 48 | 1 | బదివర్గ | బరివర్గ |
| 57 | 21 | ధన్యోస్మి | ధన్యాస్మి |
| 61 | 13 | బడిలోన | ఒడిలోన |



